# కూచిపూడి నాట్య భారతి

(వ్యాస సంపుటి)



"నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాఽప్యేకం సమారాధనమ్"


వ్యాసకర్త :

డా॥ చింతా రామనాథం, ఎం. ఏ. పి.హెచ్.డి.



అఖిల భారత కూచిపూడి నాట్య కళామండలి (రిజిష్టర్డు)

సమాదరమున ప్రచురితము.

# కూచిపూడి నాట్య భారతి

(వ్యాస సంపుటి)

వ్యాసకర్త :
డా॥ చింతా రామనాథం, ఎం. ఏ. పిహెచ్.డి.

అఖిల భారత కూచిపూడి నాట్య కళామండలి (రిజిష్టర్డు)
సమాదరమున ప్రచురితము.

తొలి ముద్రణ : ప్రతులు : 1000

విభవనామ సంవత్సరం : అధిక జ్యేష్ఠమాసం - 1988 జూన్.



ముఖ చిత్రం :

శ్రీ భాగవతుల రామకృష్ణ శర్మ

కూచిపూడి.

వెల రూ. 20/-

ప్రతుల ప్రాప్తిస్థానములు

కార్యదర్శి,
అఖిల భారత కూచిపూడి
నాట్య కళా మండలి,
కూచిపూడి - 521 136,
కృష్ణా జిల్లా, ఆంధ్రప్రదేశ్.
ఫోన్ : 246.

డా॥ చింతా రామనాథం
భారతీయ విద్యాభవన్స్
పబ్లిక్ స్కూల్,
బి. హెచ్. ఇ. యల్,
రామచంద్రపురం,
హైదరాబాద్ - 500 032.
ఫోన్ : 260141
ఎక్స్‌టెన్షన్ : 336.

ముద్రణ : చారీ & కో., చార్లెస్ స్ట్రీట్, సికింద్రాబాదు.

# అంబ ప్రార్థన

## మోహనరాగం - మిశ్రచాపు



కూచిపూడి - బాలా త్రిపుర సుందరీ అమ్మవారు

దొద్దొ దీం దాం దొదొదొ దీం దాం.

తద్దికి తక తాహత కిటతక

తకథికి తక తకదదిగిణతోం

ధీం గుణాంగుతక, తాహత కిటతక, ధిత్తళంగు,
ధిత్తళంగుతోం.

తదిరికుణాంగుతక,తాహత కిటతక ధిత్తళంగు, ధిత్తళంగుతోం,

ధీం గుణాంగుతక తాహత కిటతక తరికుణాంగుతక

తాహత కిటతక/ధీం గుణాంగుతక, తదికుణాంగుతకతోం.

అంబపరాకు, దేవిపరాకు. మమ్మేలు మా శారదాంబ పరాకు॥
అంబ॥

వాణిపరాకు, శార్వాణిపరాకు-వాణి చక్కని నీలవేణి పరాకు॥
అంబ॥

సరసీజలోచను, చెల్లెలవై మమ్ము కరుణించు బంగరు బొమ్మా
పరాకు॥ అంబ॥

ఓంకారి కౌమారి వారాహి శార్వాణి-శంకరివౌ లోకశక్తి
పరాకు॥ అంబ॥

తకిట తాం తాం తాతెయ్య యనుచు తాండవమాడిన తరుణి
పరాకు॥ అంబ॥

కనకామ్ర జలధిలో జలకములాడచు-కులుకుచు తిరిగేటి కలికి
పరాకు॥ అంబ॥

ఆరువీధుల నడుమ ఆగమైన-యలంపూరిలో వెలసిన
జోగులాంబా పరాకు॥ అంబ॥

మూడు మూర్తులకు మూలమైన-కూచిపూడిలో వెలసిన
బాలాపరాకు॥ అంబ॥

ఈ రీతిగా మిమ్ము కోరినవారిని-కావవె కనకదుర్గాంబ
పరాకు॥ అంబ॥

# భూమిక

కూచిపూడి నాట్యాచార్యులు డా॥ శ్రీ వెంపటి చిన్న సత్యం మహోదయులు కళలకు కాణాచి అయిన మద్రాసు మహానగరమున 1963 లో కూచిపూడి నాట్య శిక్షణకు, ప్రచారమునకుగాను కూచిపూడి ఆర్టు అకాడమిని స్థాపించారు. శ్రీ వెంపటి చిన్న సత్యం ఉన్నతమైన ఆదర్శాలతో మహోన్నతమైన ఆశయాలతో ఎంతో వ్యయప్రయాసలకోర్చి ఎందరినో ప్రామాణికమైన, కూచిపూడి నాట్యాచార్యులుగ తీర్చి దిద్దుతూ కూచిపూడి నాట్య భారతిని దేశ విదేశాలలో ఊరేగిస్తున్నారు. శ్రీ వెంపటి చిన్న సత్యం కూచిపూడి ఆర్టు అకాడమీని స్థాపించి రెండున్నర దశాబ్దాలు పూర్తైనాయి. ఈ సందర్భముగ అకాడమీ రజతోత్సవ వేడుకలు జరుపుకుంటోంది. ఈ మహోత్సవములో అఖిల భారత కూచిపూడి నాట్య కళామండలి పాలుపంచుకొనుటకుగాను డా॥ చింతా రామనాథం, ఎం.ఏ. పి. హెచ్ డి. కూచిపూడి నాట్యం గురించి వ్రాసిన వ్యాసముల సంపుటిని "కూచిపూడి నాట్య భారతి"గా ఆవిష్కరింపదలచింది. ఇందులకు సహృదయతో అంగీకరించిన కూచిపూడి ఆర్టు అకాడమీ వ్యవస్థాపక, ప్రాచార్య, నిర్దేశక, కులపతులు కళా ప్రపూర్ణ డా॥ శ్రీ వెంపటి చిన్న సత్యం మహోదయులకు, అకాడమీ పాలక వర్గమునకు అఖిల భారత కూచిపూడి నాట్య కళా మండలి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటూ కూచిపూడి ఆర్టు అకాడమీ స్వర్ణోత్సవ, వజ్రోత్సవ వేడుకలు జరుపుకొనవలెనని ఆకాంక్షిస్తూ ఈ సందర్భమున శుభాభినందనల నందిస్తోంది.

# విషయ సూచిక



నాట్య శాస్త్రకర్త

భరతముని

ఊహా చిత్రకారుడు : శ్రీ కోటేశ్వరరావు

# నాట్యం...ప్రయోజనం

''దుఃఖార్తానాం శ్రమార్తానాం
శోకార్తానాం తపస్వినామ్!
విశ్రాంతి జననే కాలే
నాట్యమే తద్భవిష్యతి!''

అని భరతుడు తన నాట్యశాస్త్రం ప్రథమాధ్యాయం నూటపదునాల్గవ శ్లోకంలో ప్రవచించాడు. అంటే దుఃఖార్తులకు,శ్రమార్తులకు,శోకార్తులకు, తపస్వులకు (దీనులు) విశ్రాంతిని నాట్యం కలుగజేయునని...

అలసి సొలసి విసిగి వేసారినపుడు ఆ అలపు సొలపుల విసుగుదలలను మరచి మధురమైన అనుభూతిని, బ్రహ్మానంద సహోదరమైన ఆనందమును పొందుటకు మానవుడు లలిత కళలైన కవిత్వం, సంగీతం, శిల్పం, చిత్రలేఖనం, నాట్యాలను ఆశ్రయించుట అలవాటు. కాదు. సంప్రదాయం. అసలు లలిత కళల పరమావధి హృదయాన్ని స్పందింపజేయుట రసానుభూతిని కలుగజేయుట ఆనందాన్ని అందించుటే గదా.

సర్వేంద్రియాణాం

నయనం ప్రధానమ్''... అని గదా ఆర్యోక్తి. దీనికి తగినట్లుగానే దృశ్యం శ్రవణంకన్న మానవుని హృదయఫలకంపై మిన్నగ చెరగని ముద్ర వేస్తుంది. అందువలననే పైన పేర్కొనిన లలిత కళలలో నాట్యకళ దృశ్య ప్రధానమగుటచే సామాజికుని ఎక్కువగా ప్రభావితుని చేయగల శక్తి సంపన్నమైన కళ యయినది. అంతేకాక ఈ నాట్యకళ లలితకళ లన్నింట చివరిస్థానాన్ని పొందినను మిగిలిన నాలుగు

నాట్యంలో గతార్థాలో లేక మిళితాలో కావలసినదే. కవిత్వ సంగీతాలు నాట్యమున వాచికాభినయ రూపాన్ని శిల్ప చిత్రలేఖనాలు శిల్పరూపాన్ని అనగా భంగిమల రూపాన్ని సంతరించుకుంటాయి. అందువలననే నాట్యాన్ని "సర్వకళాసారమ"ని సమాహార కళ"యని చెప్పుట పరిపాటి. నాట్యం

"నానా భావోప సంపన్నం
నానావ స్థాంత రాత్మకమ్!
లోక వృత్తానుకరణం
నాట్యమే తన్మయాకృతమ్!" అని అనగా నానాభావోప సంపన్నంగా నానావస్థాంతరాత్మకంగా లోకవృత్తాన్ని అనుకరించినట్లుగ నేనీ నాట్యాన్ని నిర్మించానని భరతుడు అంటాడు. ఇక్కడ లోకవృత్తానుకరణం... అంటే ధర్మ ప్రవృత్తులైన వారియొక్క ధర్మాన్ని, కామోపభోగుల కామాన్ని, దుర్వినీతుల దుండగాన్ని, జితేంద్రియముల దమనక్రియని, క్లీబుల హాస్యభాజనత్వాన్ని, శూరుల ఉత్సాహాన్ని, అజ్ఞానుల అజ్ఞానాన్ని, విద్వాంసుల వైదుష్యాన్ని, రాజుల విలాసాన్ని, దుఃఖితుల స్థయిర్యాన్ని, అర్థోపజీవుల అర్థాన్ని, ఉద్విగ్న చేతస్కుల ధైర్యాన్ని సామాజికులకు ప్రదర్శించుట అని అనగా మానవ స్వభావ చిత్రీకరణ... అనుకరణే నానా అవస్థలతో భావోప సంపన్నమై నాట్యమౌతోంది. అంతేకాక

"నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం
నసా విద్యా నసా కలా
నాసే యోగో న తత్కర్మ
నాట్యేస్మిన్ యన్న దృశ్యతే" అంటే నాట్యంలో లేని జ్ఞానం, లేని శిల్పం, లేని విద్య, లేని కళ, లేని యోగం, లేని కర్మ లేదు. అనగా నాట్యం సర్వ సంపన్నమైన సమాహార కళ యనే అర్థం.

అందువలననే కవి కులగురువు మహాకవి కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రంలో ప్రథమాంక చతుర్థ శ్లోకంలో

"దేవానా మిదమామనంతి మునయః
కాంతం క్రతు చాక్షుషమ్
రుద్రేణేద ముమాకృత వ్యతికరే
స్వాంగే విభక్తం ద్విధా
త్రైగుణోద్భవ మత్ర లోక చరితం
నానారసం దృశ్యతే
నాట్యం భిన్న రుచేర్జనస్య
బహుధాప్యేకం సమారాధనమ్"

అని అంటాడు. శ్లోకంలోని మొదటి మూడు పాదాలు అలా ఉంచి ప్రకృతానికొస్తే ఈ నాట్యం భిన్న విభిన్న అభిరుచులు గల జనం చేత ఒకే విధంగా ఒక్కసారిగా ఆరాధింపబడుతోందని ఆనందింపబడుతోంది అని కారణం.

"యో యం స్వభావో లోకస్య
సుఖ దుఃఖ సమన్వితః
సోఙ్గాద్యభినయోపేతో
నాట్యమిత్యభిధీయతే"... అని భరతాచార్యుడు ప్రవచిస్తాడు.

అంటే సుఖ దుఃఖాలతో ద్వంద్వ ప్రవృత్తిగల ఈ లోక స్వభావం అంగ, ప్రత్యంగ, ఉపాంగాలతో అభినయోపేతమై నాట్యమగుటయే.

అసలు మానవుని అంగ ప్రత్యంగోపాంగాదులందు ముఖ్యంగా కరచరణాల కదలికలతో అక్షి విక్షేపాలతో నాట్యం నిసర్గంగ నిబిడీకృతమై ఉంది. వేయేల భాష తెలియని ప్రాచీన మానవుడు తన మనోభావాన్ని తెలియచేసిన కర చరణ కదలికలు అక్షి విక్షేపాలే గదా నాట్యానికి నాంది పలికినవి. ఇట్టి సమాహార నాట్యకళ...

సర్వోత్కృష్టమై, సార్వత్రికమై భారతావనిలో కొలది కొలది భేదములతో... కూచిపూడి నాట్యం, భరతనాట్యం, కథాకళి, మణిపురి, ఒడిస్సి, కథక్ యిత్యాది పేరులతో ప్రస్తరింపబడి ప్రచారాన్ని పొందుతూ ఆనంద ప్రదాయియౌతోంది.

# కూచిపూడి పరిసర కళా క్షేత్రాలు

ఎన్నో శతాబ్దమునుండి నాట్యకళోపాసనకు; నాట్యకళాపోషణకు దాక్షిణాత్యులు పేరెన్నికగనినారు. దాక్షిణాత్యుల నాట్య కళాప్రియత్వ మీనాటిదికాదు. ఆంధ్రులు దాక్షిణాత్య ప్రవౌత్తిగలవారనియు, బహు నృత్త, గీతవాద్య ప్రియులనియు భరతుని వక్కాణ. అంతేకాదు. తిక్కన... విరాటపర్వము; ఎఱ్ఱన... నృసింహపురాణము; నాచనసోముడు... ఉత్తర హరివంశము; శ్రీనాథ మహాకవి కృతులు, అష్టదిగ్గజముల ప్రబంధములు పరికించిన ఆయా మహాకవుల నాట్యవర్ణనలందు ఆనాటి యాంధ్రుల నాట్యకళా వైభవము నాట్యకళా ప్రభావము ప్రస్ఫుటమగును. అంతేకాదు దక్షిణదేశమున

బౌద్ధశిల్పములను; రామప్ప దేవాలయములోని నాట్య భంగిమలను హంపీలోని అపురూప శిల్పములను, చిదంబరమునందలి నటరాజ స్వామి ఆలయగోపురముల గోడలలోనిబిడీకృతమైన శిల్పములను పరిశీలించిన దక్షిణ దేశమున నాట్యశైలూషి వేసిన వాలకములు అలవోకలని విదితమగును. అసలు దాక్షిణాత్యుల నాట్యములో శిల్పకళ అంతర్వాహినియై సంగీత సాహిత్యములతో కలిసి త్రివేణీ సంగమమై రస సముద్రమున తరంగిణియై సమీహితమగును. శిల్పములేని నాట్యము శిల్పానికి నోచుకొనని శిలవంటిది. జీవితము లేని జీవివంటిది. నాట్యానికి శిల్పము జీవమైన రసము. ఆత్మయగును. అందువలననే దాక్షిణాత్యుల నాట్య శైలి అపూర్వమైనదని; నిత్యనూతనత్వముతో నిసర్గ రస స్యందినియైనదని హృదయానందదాయినియని ప్రశస్తి నొందుచున్నది.

# కూచిపూడి నాట్యకళ...
# శ్రీ సిద్ధేంద్రయోగి

దాక్షిణాత్యుల నాట్యశైలులలో ఆంధ్రులకు గర్వకారణముగ నిలిచినది కూచిపూడి నాట్యకళ. ఇది ఆంధ్రుల జాతీయ నృత్యకళ. దక్షిణ దేశమున నున్న ప్రాచీన శాస్త్రీయ నాట్య శైలులన్నింటియందు ప్రాచీనమై శాస్త్రీయమై విరాజిల్లుచున్న నాట్యకళ కూచిపూడి నాట్యకళ. సుమారు ఏడెనిమిది దశాబ్దముల ప్రాచీనతను, చారిత్రక ప్రధాన్యతను; సశాస్త్రీయతను; సంప్రదాయ చోదితమును కలిగినది కూచిపూడి నాట్యకళ. నేడు కూచిపూడి నాట్యకళ ఖండాంతరఖ్యాతితో ప్రపంచమునందంతటను నీరాజనముల నొందుచున్నది. కూచిపూడి నాట్యకళాక్షేత్రమున జన్మించిన నాట్యాచార్యులెందరో తమ జీవితములను ఆ నాట్యకళాధిదేవతకు నైవేద్యమొనర్చినారు. అందరికి నా వందనములు. అందరిలో అందమైన మలుపు త్రిప్పి అటు ఆంధ్ర వాఙ్మయమునకు ఇటు కర్ణాక సంగీతమునకే గాక నాట్యంలో నవరసము లొలికించి, పలికించి పులకింపజేసిన కలాప ప్రక్రియాప్రబంధ సృష్టి ప్రతిష్ఠా మహిమాన్వితుడు, యోగిపుంగవుడు సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రుని మానసపుత్రిక... సిరిసిరిమువ్వ... సత్యభామ... భామాకలాపము. ఈ యోగి పుంగవునిచే ప్రభావితుడుగాని నాట్యవేత్త; రసజ్ఞుడు సాహితీవేత్త దక్షిణదేశముననే లేడు. ఆంధ్రవాఙ్మయమున కలాప, యక్షగాన వాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన శ్రీ సిద్ధేంద్రుని మార్గమున పయనించని కవి ఆంధ్రకలాప యక్షగాన వాఙ్మయ చరిత్రమున కానరాడు. అంతేకాదు. 'హరికథా పితామహుడై'న ఆదిభట్ల నారాయణదాసు సహితము శ్రీ సిద్ధేంద్రుని సృష్టివైచిత్రికి స్పందించెను. ప్రణతిల్లెను. అనుసరించెను. అసలు సిద్ధేంద్రునిచే ప్రభావితముగాని ప్రతిభాసంపన్నులైన సంగీత సాహిత్య నాట్య స్రష్టలు

లేరనవచ్చును. అందులకు హేతువు శ్రీ సిద్ధేంద్రుని సిద్ధేంద్రుని భామాకలాపము వడగట్టిన అలంకార భరతశాస్త్రముగ భాసిల్లుచున్నదని శ్రీ విశ్వనాధవారి వక్కాణ. సిద్ధేంద్రుడు తన స్వగ్రామమైన కూచిపూడిలో తనకు పూర్వమే తిష్టవేసియున్న నాట్యకళాజ్యోతిని ప్రజ్వరిల్లజేసెను. తరువాతి తరమువారు వారసత్వముగ వచ్చుచున్న ఆ జ్యోతిని యారనీయక వెలుగులను తగ్గనీయక; నేటివరకు కాపాడుకొనుచు విస్తృత ప్రచారము చేయుచుండిరి.

కూచిపూడికి దక్షిణముగ క్షేత్రయ్య మొవ్వ; బౌద్ధారామము వాణిజ్యకేంద్రము అయిన ఘంటసాల, దేవదాసీ నృత్య సంప్రదాయమున పీఠమైన శ్రీకాకుళము; పశ్చిమముగ బహురూపక కళకు సుప్రసిద్ధమైన గడ్డిపాడు (హనుమంతరాయపురము)లు సుమారొక పదిమైళ్ళ పరిధిలో నేర్పడి కూచిపూడి పరిసరక కళాక్షేత్రము,లుగ చరిత్ర ప్రసిద్ధములైనవి. వీటి చారిత్రక ప్రాశస్త్యమును తెలుపుటే ఈ వ్యాసరచనోద్దేశము.

## మొవ్వ:

మొవ్వ గ్రామమున ఒక శివాలయము, ఒక విష్ణ్వాలయము రెండును కలవు. ఈ యూరుకీ నామమెట్లు వచ్చినదని విచారించగ శ్రీ మంత్రాల నారాయణమూర్తిగారిట్లు చెప్పిరి. ''మౌద్గల్య మహర్షిచే శివలింగ ప్రతిష్ఠ చేయబడిన గ్రామమగుటచే మొవ్వ అను నామమేర్పడినది.'' ఇంతేకాదు వేరొక ఐతిహ్యము కలదు. నటరాజు ఆనందాతిరేకమున తాండవము చేయు సమయమున ఆ స్వామి చరణ కింకిణులలో నొక మువ్వ ఇట నిపతితమగుటచే ఈ పవిత్రస్థలమునకు 'మువ్వ' అను నామమేర్పడినదందురు.

ఈ మొవ్వ గ్రామమున సుమారేడెనిమిది వందల సంవత్సరముల ప్రాచీనతగల ఆలయము శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము. ఈ స్వామిని సేవించి, పదములు రచించి, అంకితము గావించి తరించిన

వాగ్గేయకారుడు: పదకర్త క్షేత్రయ్య.

క్షేత్రయ్య ఆరాధ్య దైవమైన వేణుగోపాలస్వామి ఉత్సవ విగ్రహములందు 'మవ్వ' అని లిఖింపబడియున్నది. కనుక ఈ గ్రామము

మవ్వ... మువ్వ... మొవ్వగా మార్పు చెందియుండవచ్చును. ఏదిఏమైన నేడీ గ్రామము 'మొవ్వ'గనే వ్యవహృతమగుచున్నది.

శ్రీ వేణుగోపాలస్వామి విరాట్ స్వరూపమును ఉత్సవ విగ్రహములను పరీక్షించిన పిమ్మట ఆ స్వామిని వేణుగోపాలస్వామి యనుటకంటే మువ్వగోపాలస్వామి యనుటయే ఉచితముగ కన్పట్టును. క్షేత్రయ్యయు 'మువ్వగోపాల' 'మవ్వగోపాల' అనియే సంబోధించెను; ప్రయోగించెను. వ్యవహరించెను. ఉదాహరించెను. అనగా క్షేత్రయ్య మువ్వలు ధరించి నర్తించు బాలగోపాలుని... మువ్వగోపాలుని ఆరాధించియుండును.

## క్షేత్రయ్య పదములు:

ప్రపంచమున సాహిత్య ప్రక్రియలన్నింటికి ప్రథమమైనది పదకవిత. చరిత్రకందినంత వరకు తెలుగు సాహిత్యమున ఈ పదకవితకు పితామహుడు ప్రథమాంధ్రసంకీర్తనాచార్యుడు అన్నమయ్య. అన్నమయ్య రచనలు సంకీర్తనలుగ ప్రసిద్ధినొందగ క్షేత్రయ్య రచనలు పదములుగ ప్రఖ్యాతి నొందుచున్నవి. ఏది యేమైన అసలైన సిసలైన పదకర్త క్షేత్రయ్య అనుట నిర్వివాదాంశము. ఇక క్షేత్రయ్య పూర్వాశ్రమజీవితమును గురించి క్లుప్తముగ తెలిపెదను.

వేంకట రమణమ్మ వేంకటాచలం అను పుణ్య దంపతుల గర్భశుక్తిముక్తాఫలం వరదయ్య. ఈతడు మొవ్వ వంశస్థుడు. ఇంతకాలం వరదయ్య 'వరద'గ వ్యవహృతుడయ్యెను. ఈతడు క్రీ.శ. 1600... 1700 కాలమునందు మొవ్వ గ్రామమునందుదయించెను. ఈతని జీవిత చరిత్ర విద్యాభ్యాస విషయయములందు చిత్రవిచిత్ర రీతుల భిన్నవిభిన్న వాణులు విన్పించుచున్నవి. ఏది ఏమైన వరదయ్య పదకర్త

అగుటకు పూర్వము సంగీత సాహిత్యములతో పాటు నాట్యమునుకూడ నభ్యసించి యుండవలయును. ఆ తరువాతఅతనికి భగవదనుగ్రహముకూడా తోడైయుండును. ఈతనికి పూర్వమే కూచిపూడివారు నాట్యకళతోపాటు సంగీత, సాహిత్య మంత్రశాస్త్రములందు లబ్ధప్రతిష్ఠులైనట్లు వారిత్రకాధారములవలన తెలియుచున్నది. ఇట్టితరి వరదయ్యను కూచిపూడి భాగవతులు అయస్కాంతమువలె నాకర్షించి యుందురు. అదియునుగాక కూచిపూడి, మొవ్వలు భౌగోళికముగ ప్రక్కప్రక్కలనే ఏర్పడియున్నవి. తన కాలముననే భరత విద్యాదురంధరులుగ పరమ భాగవతోత్తములుగ ఖ్యాతిగాంచిన కూచిపూడి భాగవతుల శుశ్రూషించి క్షేత్రయ్య అభినయ విద్యనభ్యసించి యుండును.

వరదయ్య సంగీత నాట్యములభ్యసించి ప్రావీణ్యము సముపార్జించనిచో పదమును అభినయమున కంత అనువుగ రచించి యుండెడివాడు కాదు. అందువలననే క్షేత్రయ్యను కేవలము పదకర్తగనే గాక ఉత్తమ అభినయాచార్యునిగ సంగీత కళానిధిగ శ్రీ ఆరుద్రగారు 'మహాకవి క్షేత్రయ్య' చలనచిత్రమునందు చిత్రీకరించిరి. కాగా క్షేత్రయ్యను సిద్ధేంద్రయోగి శిష్యునిగ చిత్రీకరించుట చరిత్రకు పొసగని విషయము.

వరదయ్య మువ్వగోపాలుని కరుణా కటాక్ష వీక్షణమునగాని మరే యితర ప్రేరణము వలనగాని పదములు వ్రాయనారంభించెను. ఈతడు తేటతెలుగున తేనెలు జాలువారునట్లుగా మృదు మధురములుగ, మధురభక్తి ప్రతిపాతితములుగ శృంగారరస సుధా కలశములుగ: మువ్వగోపాలునికి అంకితముగ పదసహస్రములను వెలయించెను. వరదయ్య అంతటితో తృప్తిచెందలేదు. నానావిధ దేశాటనము: బుధవర్గముతో సంభాషణము పుణ్యక్షేత్రములు సందర్శనము చేయదలచెను. తొలుత నానారాజ సందర్శనము గావింపదలంచి మధురకేతెంచెను. కాని రాజాస్థానముల ప్రవేశమంత సులభముకాదని గ్రహించెను. అంతటితో నిరాశ నిస్పృహలను జెందక దక్షిణాపథమునగల పుణ్యక్షేత్రములను తీర్థములను సేవింపదలంచెను.

నానాక్షేత్రములను సందర్శించి వరదయ్య క్షేత్రజ్ఞుడుగ క్షేత్రయ్యగ అన్వర్థ నామధేయుడయ్యెను. తాను దర్శించిన సేవించిన ప్రతి స్వామిమీద పదములు చెప్పెను. ఎట్టకేలకు రాజాస్థానములో స్థానము సంపాదించెను. ఈ సందర్భమున క్షేత్రయ్య చెప్పిన ఈ చాటువు చూడుడు.

*"తముదామెవత్తు రర్థులు*
*క్రమ మెరిగిన దాత కడకు రమ్మన్నారా*
*కమలంబులున్న చోటికి*
*భ్రమరంబుల నమ్యతేంద్రి రఘునాథన్నపా;*

ఈ విధముగా క్షేత్రయ్య తిరుమల నాయకుని రఘునాథ నాయకుని విజయరాఘవ నాయకుని గొల్కొండనవాబు అబ్దుల్లా కుతుబ్‌షాలను దర్శించి వారి యాస్థానము సంపాదించి దివినుండి భువికి దిగివచ్చిన గాంధర్వ సార్వభౌముడా! అభినవ అభినయ భరతాచార్యుడా! అనునట్లు తన పద రచనతో గాన నృత్యాభినయములతో దక్షిణాపథము నుయ్యాల జంపాల లూగించి అసంఖ్యాక పురస్కారములనొంది పద కర్తృత్వ, పదాలాప, పదాభినయ విషయమున తదనంతర తరమువారికి మార్గదర్శి యయ్యెను.

క్షేత్రయ్య తన పదరచనతో ఇటు ఆంధ్ర వాఙ్మయమునకు, అటు కర్ణాట సంగీతమునకు ఇటు కూచిపూడి నాట్యమునకు పుష్టిని తుష్టిని చేకూర్చెను. ఇటువంటి పరమ భాగవతోత్తముని; మహాకవిని అభినయాచార్యుని, మహాప్రవక్తను ఆంధ్రుల కొసంగిన మొవ్వగ్రామము సదా శ్లాఘనీయమైనదిగదా!

## ఘంటసాల

అపురూపములైన బౌద్ధశిల్పములకు కాణాచి ఘంటసాల. ఆంధ్ర దేశమునందు ఒకనాడు ఓడరేవు ప్రాంతమై ప్రముఖ వాణిజ్య కేంద్రముగ ప్రసిద్ధి పొందినది ఘంటసాల. అంతేకాదు. ఆంధ్రదేశ

చరిత్ర కాధారముల నొసంగుచున్నది ఘంటసాల. ఘంటసాలలో లభించు బౌద్ధమతావ శేషములకు ఓడరేవునకు అవినాభావ సంబంధము కలదు. నాడు ఘంటసాల ప్రముఖ విదేశ వాణిజ్య కేంద్రమగుటచేతను, బౌద్ధమతమును విదేశములలో ప్రచారము చేయుటకు రాకపోకలకు అనువగు స్థానమగుటచేతను, బౌద్ధులు ఘంటసాలను తమ ప్రధాన ప్రచార కేంద్రముగ నెన్నుకొని యుందురు. ఆనాటికే విదేశీయులను బౌద్ధమత మధికముగ నాకర్షించుచు పునాదులు వేసికొనుచున్నది.

ఇక ఘంటసాల బౌద్ధుల కాశ్రయమిచ్చుటను గూర్చి ఆలోచించిన బౌద్ధమతమునకు జన్మనిచ్చినది ఉత్తర హిందూస్థానమైనను పెంచి పెద్దజేసినది దక్షిణ దేశమే. అందువలననే ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట, అమరావతి, భట్టిప్రోలు యిత్యాది ప్రాంతములు బౌద్ధకాలమునాటి శిల్పములు అవశేషముల కాకరములై నాటి చరిత్రకు నేడు ఆధారముల నొసంగుచున్నవి. సాక్షాత్తు బుద్ధ భగవానుని పాదస్పర్శచే పావిత్ర్యమును పొందినదో లేదో కాని బౌద్ధ స్వీకారమున అందరికంటే ముందడుగువేసి 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నది ఆంధ్రులు అందులో ఘంటసాల. ఇందులకు కారణ మూహింపవచ్చును. ఆంధ్రులు ఎల్లపుడు వైవిధ్యమును నిత్యనూతనత్వమును కోరు వారగుటచేతను, జీవకారుణ్యము, విశ్వప్రేమ, శాంతి, విశ్వమానవ సౌభ్రాతృత్వము, నిత్యపరిణామశీలములు నిసర్గ గుణములగుటచేతను "అహింసో పరమో ధర్మః" అను సూక్తి ప్రధానముగా కలిగిన బౌద్ధమునకు ఆశ్రయమిచ్చి, ఆదరించి అవలంబించి యుందురు.

## బౌద్ధము... శిల్పకళ

బౌద్ధమత ప్రవక్తల ప్రబోధముకన్న ఆ మత ప్రచారమునకు ఆలంబనమై శిల్పకళ మిన్నగ ప్రజల నాకర్షించినది. భాషకన్న భావముమిన్న యనునది శిల్పముల విషయమున యథార్థముగ కన్పట్టును. ఈ శిల్పములు సజీవములు. ఇవి ప్రాణులుగాని ప్రాణులు,

జీవులుగాని జీవులు, చిరాయువులు, అనిర్వచనీయ ఆనంద ప్రదాయకములు. శాంతి, దాంతి, అహింస, ప్రేమాదులు ఈ శిల్పములందు గోచరించును. ఇట్టి శిల్పశైలి అమరావతి శైలియగుట ఆంధ్రులకు గర్వకారణము. శిల్పకళను సాధనముగ జేసికొని బౌద్ధులు తమ మత ప్రచారము గావించిరి. లలిత కళలను సాధనములుగ జేసికొని తమ తమ అభీష్టములను సిద్ధింప జేసికొనుట ప్రాచీనకాలమునుండి కద్దు. పాల్కురికి సోమనాధుడు కవిత్వమును సాధనముగ జేసికొని వీరశైవ మతమును ప్రచారము గావించెను. కూచిపూడివారు క్రీ.శ. 1506లో సంబేట గురవరాజు దుష్కృత్యములను వీరనరసింహరాయల సమక్షమున కేళికగ ప్రదర్శించి ప్రయోజనమును సాధించుట పూర్వోక్తములు.

ఈ విధముగ బౌద్ధశిల్పములకు తావై చరిత్రకారులకు ఆధారముల నొసంగుచు సుప్రసిద్ధమైన చరిత్రను సృష్టించుకొనిన శిల్పకళాక్షేత్రము ఘంటసాల.

## శ్రీకాకుళము:

పూర్వము నిశంభుడనే లోకకంటకుని పీడనుండి ఆంధ్రప్రాంతమునకు విముక్తి నొసంగిన ఒకానొక శాతవాహన ఆంధ్రరాజునే అనంతకాలమున దైవముగా భావించి కొలుచుచుండిరని ఒక గాథ కలదు. ఆ రాజు ఆంధ్ర నాయకస్వామి అనే తెలుగు వల్లభుడని, తెలుగురాయుడని, ఆంధ్రవిష్ణువని వ్యవహరింతురు. ఆంధ్రులకు రాజధానియులు ఆంధ్ర మహావిష్ణువనబడు శ్రీకాకుళేశ్వర స్వామికి నివాసమైనది శ్రీకాకుళము. ఈ దేవాలయము దేవదాసీల ఆరాధనా నృత్యములకు రంగస్థలమైనది. స్వామి తిరునాళ్ళ సమయముననేకాక ప్రతినిత్యము దేవదాసీ సమూహము 'నృత్యం దర్శయామి'యని తమ నృత్యముతో స్వామిని యారాధించిరని చరిత్రవలన తెలియుచున్నది. నేటికిని యిట దేవదాసీలు కలరు. సశాస్త్రీయ దేవదాసీ నృత్య సంప్రదాయమునకు పీఠమైనదీ శ్రీకాకుళము. కృష్ణవేణీ ప్రవాహాతరంగముల వలని పావిత్ర్యము కలిగి

అష్టోత్తర తిరుపతులలోను మహిమాన్వితమైన మహాపుణ్యక్షేత్రము శ్రీకాకుళము.

ఒకనాటి యాంధ్రుల రాజధానియయిన శ్రీకాకుళము నేడొక కుగ్రామముగ మిగిలియున్నది. కాని శ్రీ కాళేశ్వరస్వామి ఆలయము శతాబ్దముల తరబడియున్నను చెక్కుచెదరలేదు. నాటి రాజుల శిల్పకళాభిరుచికి; శిల్పుల నైపుణ్యమునకు ఉదాహరణము నిలిచియున్నదీ దేవాలయము. ఈ స్వామికి కోందండరామన్న దేశాయిగారు సుమారేడెనిమిది వందల ఎకరముల సుక్షేత్రమున ముక్కోటి వైశాఖ పూర్ణిమ మహోత్సములు నయనానంద దాయకములు. పుణ్యప్రదములు, ఈ తిరునాళ్ళే శ్రీనాథ కవిసార్వ భౌమునిచే వర్ణింపబడినవి. ఈ తిరుమనాళ్ళలో స్థానిక దేవదాసినుల నృత్య ప్రదర్శనములే కాక కూచిపూడి భాగవతుల ప్రదర్శములను వార్షికములుగ భక్తులకొఱకేర్పాటు చేయుదురు.

కొందరీ శ్రీకాకుళము శ్రీ కృష్ణదేవరాయలకు రాజధానియయినదని అందురు. ఏది ఏమైన శ్రీకాకుళము ఆంధ్రదేశములోని ఒక ప్రముఖ ప్రాచీన దేవదాసీ నృత్య సంప్రదాయమునకు ప్రతిభా సంపన్నులైన కవిరేణ్యులకు నివాసమై చరిత్ర ప్రసిద్ధమైనది.

## గడ్డిపాడు: (హనుమంతరాయపురము)

సంగీత నృత్య నాటక యక్షగానములకు కూచిపూడి ఎట్లు ప్రసిద్ధి నొందినదో అటులే పగటివేషములకు (బహురూపక కళకు) ప్రసిద్ధమైనది గడ్డిపాడు. ఈ ఊరు కూచిపూడికి పశ్చిమదిశగ నాలుగు క్రోసుల దూరముననున్నది. ఇందలి బ్రాహ్మణులందరు వేదాధ్యయనపరులు. ఈ గ్రామమునందు కణుపూరివారు; కవులవారు; కూచివారు; పల్లావఝలవారు; బాపట్లవారు; బెల్లంకొండవారు; శ్రీకారంవారు; యిత్యాది వంశస్థులుండెడివారు. బ్రాహ్మణ భాగవతులు నివసించు గ్రామమగుటచే గడ్డిపాడు అగ్రహారమైనది. ప్రస్తుతము పైన పేర్కొనబడిన వంశములలో ఒకరు

ఇద్దరు వినా మిగిలిన వారెవ్వరు ఇందులేరు. వీరుకూడ ప్రస్తుతమీ ప్రదర్శన లిచ్చుటలేదు. గడ్డిపాడున పగటివేషములు నేతిబీరకాయ చందమున నున్నవి. ఈ గ్రామీణులా గ్రామననామమునే హనుమంతరాయపురముగ మార్పుజేసికొనిరి.

ఈ గడ్డిపాడు పగటివేషధారులకు గురువు పల్లావఝల వేంకటరామయ్య. వీరు మైసూరు ప్రాంతమునుండి వచ్చి గుంటూరు మండలములోని రేపల్లెలో స్థిర నివాసమేర్పరచుకొని గడ్డిపాడు బ్రాహ్మణులకు పగటివేషములు (బహురూపక కళ)ను నేర్పి ఖ్యాతి గాంచిరని కొందరు చెప్పుదురు. కాని గడ్డిపాడు భాగవతులీ బహురూపక కళను, రూపక కళయందు, నాట్యకళయందు నిష్ణాతులు కళావేత్తలు అయిన కూచిపూడి భాగవతులనుండి అభ్యసించిరని కొందరందురు. ఏదిఏమైన గడ్డిపాడొక బహు రూపక కళాక్షేత్రమగుట నిర్వివాదాంశము.

కూచిపూడిలో నాట్య నాటక యక్షగాన విద్యలలో ప్రావీణ్యము లేనివారీ బహురూపక కళను చేపట్టిరి. కూచిపూడి భాగవతులకేనాడీ భరతవిద్య అబ్బినదో ఆనాటినుండి పగటివేషములును ప్రచారములోనికి వచ్చినవి. కూచిపూడివారు ప్రదర్శించు బైరాగివేషకథ; బుడబుడక్కలవేషకథ; శక్తివేషకథ; యిత్యాది కథలనే గడ్డిపాడువారు ప్రదర్శించేవారు. ప్రస్తుతము గడ్డిపాడునందు పగటివేషముల మేళములు లేవు. కాని కూచిపూడియందీకళ నేటికిని సజీవమై ప్రచారమగుచు ప్రజలకు విజ్ఞాన వినోదముల నందించుచున్నది.

ఈ విధముగ కూచిపూడికి పరిసర కళాక్షేత్రములైన మొవ్వ, ఘంటసాల, శ్రీకాకుళము, గడ్డిపాడులన్నియు సుమారొక పదిమైళ్ళ పరిధిలో కేంద్రీకృతమై దివిసీమను దివ్యసీమగ చేయుచున్నవి. ఇట్టి మహాభాగ్యమొక దివిసీమకే దక్కినదనుట నతిశయోక్తి కాదు. ఈ కళాక్షేత్రములన్నింటికి కూచిపూడి కళాకేంద్రస్థానమై రాజధానివలె విరాజిల్లుచున్నది. పైన పేర్కొనబడిన కూచిపూడి పరిసర కళాక్షేత్రములలో ఒక్క కూచిపూడిలో వినా లబ్ధప్రతిష్ఠులు అల్పముగ

కన్పట్టుదురు. కూచిపూడి కళాకారులు శతాబ్దములు అవిచ్ఛిన్నముగ నా కళననుష్ఠించుచు మండలాంతరములకు, రాష్ట్రేతరములకు దేశాంతరములకు, ఖండాంతరములవరకు గొనిపోయి అట ప్రతిష్ఠించి కూచిపూడి నాట్యకళా భారతిని ఆవిష్కరించి ప్రచారము గావించుచుండిరి. దక్షిణాదిలోని మేలట్టూరు నాట్య సంప్రదాయము కూచిపూడి నాట్య సంప్రదాయపు వారసత్వము కలిగినట్టిదే. కూచిపూడి కళాకారులలో కొందరు ప్రచారార్థమరిగి యట స్థిరపడిరి. కర్నూలు మండలంలోని బనగానపల్లి నవాబు కోరికపై కొందరు అక్కడ స్థిరపడిరి. అచ్యుతప్ప నాయకుని ఆస్థానమున స్థానము సంపాయించి అక్కడ కొందరు స్థిరపడిరి. కూచిపూడి పరిసర కళాక్షేత్రములకేకాక ఆంధ్రుల సంస్కృతికి ఆంధ్రుల జాతీయ నాట్యకళకు కేంద్రస్థానమై తన కళాసురభిళములను ఖండాంతరములకు గొనిపోవుచున్న దనుటకు సాక్ష్యం కొద్దిమాసముల క్రిందటి డా. శ్రీ వెంకటి చిన్నసత్యంగారి అమెరికా దిగ్విజయ కళా జైత్రయాత్ర. అంతేకాదు. ప్రపంచంలోని చాల ఖండంములందు కూచిపూడి నాట్య అకాడమీలు స్థాపించబడి శిక్షణతో ప్రదర్శనలతో ప్రచారము జరుగుచుండుట అవశ్యం ప్రశస్య విషయము.

# కూచిపూడి...నాట్య చరిత్రపుటలు

భారతదేశంలో భిన్నవేష భాషలు భిన్న శీతోష్ణస్థితిగతులు వున్నట్లుగనే కూచిపూడి నాట్యం, భరతనాట్యం, కథాకళి, ఒడిస్సీ, మణిపురి, కథక్ ఇత్యాది నాట్య సంప్రదాయాలు ప్రసిద్ధిచెందాయి. ఈ రోజున దేశ విదేశాలలో కూచిపూడి ఆర్టు అకాడమీలు వెలిశాయి. ఒకనాటి కూచిపూడి కుగ్రామం నేడు భారతదేశం పటంలోనే కాక ప్రపంచంలోనే స్థానమాక్రమించు కుంటోంది. ఇట్టి కూచిపూడి నాట్యానికి చరిత్రపుటల్లోని స్థానాన్ని పురాతనత్వాన్ని, తెలుపుటయే ఈ వ్యాసోద్దేశం.

పైన పేర్కొనబడిన భారతదేశంలోని నాట్య సంప్రదాయాలన్నింటిలోను మిన్నయైంది, పురాతనమైంది కూచిపూడి నాట్యం. ఇది ఆంధ్రదేశానికి నడిబొడ్డున కృష్ణాజిల్లా కూచిపూడిలో తిష్టవేసి ఆంధ్రుల జాతీయ నాట్య కళగా భాసించడం ఆరుకోట్ల ఆంధ్రులకు గర్వకారణం. అసలు ఆంధ్రదేశంలో క్రీస్తుపూర్వమే నాట్యకళ ప్రచారంలో వున్నట్లు హాలుని 'గాధా సప్తశతి' తెలుపుతోంది.

భారతీయులకు తొలి లక్షణ గ్రంధమైన భరతుని నాట్యశాస్త్రంలో ఆంధ్రులు నృత్త, గీత, వాద్య ప్రియులని ప్రశంశించబడ్డారు కూచిపూడి నాట్యానికి తొలి లక్షణగ్రంధం 'భరతుని నాట్యశాస్త్రం' పిమ్మట నందికేశ్వరుని 'అభినయదర్పణం' ఈ గ్రంధప్రతులు తెలుగు లిపిలోనుండుట యొక విశేషం. కావుననే నందికేశ్వరుడు ఆంధ్రుడని విశ్వసించ బడుతున్నాడు.

క్రీ.శ. 13వ శతాబ్దిలో రచించబడిన జాయపసేనాని 'నృత్తరత్నావళి' ఆంధ్రుల నృత్య కళా ఔన్నత్యానికి నికషోపలం. అంతేకాదు. ఎందరో రాజులు ఎన్నో నృత్య లక్షణ గ్రంధాలు వెలయించారు.

ఈ విధంగా ఆంధ్రదేశం నాట్యాధిదేవతయైన నటరాజ నర్తించు ఆదిపీఠమై అలరారుతోంది.

## శివకవులు...కూచిపూడి నాట్యం:

శివ కవులలో ప్రముఖుడైన పాల్కురికి సోమనాధుడు 'పండితారాధ్య చరిత్ర' 'బసవ పురాణం' అనే గ్రంథాలు వ్రాశాడు. అందు శ్రీశైలంలో శివరాత్రినాడు జరుగు జాగరణ విశేషాలు వర్ణించాడు వాటిలో మార్గీయ, దేశీయ నృత్యాలు ప్రజలకు ఆనందాన్నిస్తున్నాయని తెలిపాడు. 'శివలీలలు' శివరాత్రినాడు ప్రదర్శించుట పరిపాటిట దీనినిబట్టి క్రీ.శ. 12, 13 శతాబ్దాలకే కూచిపూడి నాట్యకళ ఉత్కృష్టదశలో నున్నదని యూహించవచ్చు.

## విజయనగర రాజులు... కూచిపూడి నాట్యం:

విజయనగర సామ్రాజ్యంలో "వీధినాటకం" ప్రదర్శనాన్ని అబ్దుల్ రజాక్ చూసినట్లు "ఇలియట్....ఇండియా"అనే గ్రంథంలో వుంది. ఈ అబ్దుల్ రజాక్ క్రీ. శ. 1443లో భారతదేశానికి రాయబారిగా వచ్చాడు. ఈ కాలంలో కూచిపూడి నాటకాలు ప్రముఖంగా ప్రదర్శించుట గమనార్హం అబ్దుల్ రజాక్ చూచిన "వీధినాటకం" కూచిపూడి వారిదేనని నా నమ్మకం.

## వీర నరసింహరాయలు...కూచిపూడి నాట్యం:

కూచిపూడి భాగవతుల ప్రసక్తి ప్రథమంగా మాచుపల్లి కైఫీయత్‌లో పేర్కొనబడింది. ఇదియే చరిత్రపుటల్లో కూచిపూడి నాట్యానికి లభించిన ప్రథమస్థానం, ప్రముఖస్థానం.

'క్రీ. శ. 1505...1509 లో వీర నరసింహరాయలు

విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఈతని సమక్షమున కూచిపూడి భాగవతులొక కేళిక ప్రదర్శించినట్లు స్పష్టమౌతోంది సంబెట గురవరాజు సిద్దవటం సీమకు వీర నరసింహరాయల ప్రతినిధిగా పరిపాలన జరిగింది.

## మాచుపల్లి కైఫీయత్తు...కూచిపూడి నాట్యం:

సంబెట గురవరాజు చాలకాలము జీవించి ప్రభుత్వము చేయుటచే ఆయనను "తాత గురవరాజు" అని చెప్పుకొనేవారు. ఈతని ప్రభుత్వంలో ప్రజలకు అతిదారుణ శిక్షలు విధించేవారు ప్రజలు త్వరగా సొమ్ము ఇవ్వకపోతే స్త్రీల స్తనాలకు చిరుతలు పట్టించేవారు.

అలాంటి దినములలో వినుకొండ తట్టున కూచిపూడి గ్రామంనుండి బ్రాహ్మణులు భాగవతువనే వేషధారులై కీర్తన నిమిత్తమై మాచుపల్లి వచ్చి వుండిరి. గురవరాజుగారి దారుణ ప్రభుత్వము చూచి విద్యానగరమునకు వలసపోయిరి అచ్చట వీర నరసింహరాయల దర్శనము చేసికొని కేళిక అడుగగా అతడు శెలవిచ్చెను. కూచిపూడి మేళంవారు చాలా విద్యావంతులని ప్రసిద్ధియుండుటచే స్త్రీలుకూడా చూడవలెననినగర్ల వద్ద దివాణములో కీర్తనకు రాయులవారు శెలవిచ్చినారు. రాయల సమక్షమున సంబెట గురవరాజువలె నొకడు, బంటో్రితులవలె ఇద్దరు వేషంవేసిరి. గురవరాజువలెనే ఆ వేషగాడు స్త్రీయొక్క స్తనాలకు చిరుతలు పట్టించి సొమ్ము యివ్వమని తహశీలు చేసినట్లు రాయలవద్ద వినికిడి చేసినారు.

అప్పుడు రాయలవారది యేమని ప్రశ్నింప ముఖస్తులయినవారు సిద్దవటం సీమలో గురవరాజను నాతడు ప్రజలవద్దనుండి సొమ్ము వసూలుచేయుటకు స్త్రీలనిట్లే తహశీలు చేయుచుండెనని భాగవతుల ముఖతా ఏలినవారికి తేటపడుటకై యిట్లు వేషములు కట్టినారని విన్నపం చేశారు. రాయలు చాలా కినుక చెంది యాసంగతి మరునాటి ఉదయమున తిరుగ జ్ఞాపకం చేయమని ముఖస్తులకు ఆజ్ఞనిచ్చినారు.

ఆ రాత్రి కీర్తన పూర్తయిన పిదప మరునాడు ఉదయము రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చుకొని ఆస్థానమునకు విచ్చేసిరి. వారి వద్దనున్న కార్య వారకులు సంబెటగురవరాజు వర్తమానం జ్ఞాపకం చేయగా విని ప్రధానులను సేనాలను పిలిపించి ముహిమంకు (ముఖ్యకార్యము) సైన్యం సిద్ధం చేయవలసిందిగా శెలవిచ్చారు. ఆస్థాన పంజరంలోని చిలుక ''జయం జయం జయం''అని మూమ్మారు పలికినది ఆ పలుకులు విని యిదే మనకు మంచి శకునమని మహారాజు అప్పుడే పీషుఖాను బయట వేయించి సైన్యమును బట్వాడాలుగా చేయించి, వానికి ఖర్చు వెచ్చములిప్పించిరి. ఆ ముహిమంకు తమ కుమారుడనిపించుకొన్న ''ఇషుమాలు ఖాను'' అనే తురుక సర్దారును ''మొకర్రరు'' (నిర్ణయము)చేసి అతనిని పిలిపించి సమక్షంన వలసిన బుద్ధులు చెప్పి తాంబూలమిచ్చెను అతడాది గైకొని గురవరాజు తలతెత్తునని ప్రతిజ్ఞ పలికి సైన్యము వెంటగొని గురవరాజు కోటకు పశ్చిమమున బండ్లకనుమమీద లడాయి చేసెను కనుముపై చౌకి విరగబొడిన కనుమపారు అయివచ్చి ఆ దినంరాత్రి కోటకు పశ్చిమాన వున్న ''గుండ్లకట్ట'' అనే సన్నకొండమీద దమదమాలు యెత్తి ''మెహర్జాలు'' ఫిరంగులు ఖాయంచేసి లడాయి ఝురూ చేసేను. శక్తిమేరకు కోటలోకి వేటువారు జవాబిచ్చిరి. అంతట కోటలోనివారు ఏమీ చెయ్యలేక కౌలుమీద (అభయంపొంది) కోటయివ్వగా గురవరాజును పట్టుకొని తల తీసికొనిపోయిరి.

ఈ కైఫీ యత్తును పరిశీలించగా క్రీ.శ. 1505 కు పూర్వమే కూచిపూడి భాగవతులు భరతవిద్యవేత్తలుగా ప్రసిద్ధిచెందినట్లు తెలుస్తుంది. నాట్యకళను సాధనంగా చేసుకొని ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించుట గమన్హారం. ''కళ కళ కొరకే కాక ప్రజల కొరకు అనే విషయం స్థారకత చెందింది.

# శ్రీ కృష్ణదేవరాయలు... కూచిపూడి నాట్యం:

వీర నరసింహరాయల తర్వాత సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన శ్రీకృష్ణదేవరాలు క్రీ.శ. 1509 ఉత్తారార్థంలో విజయనగర స్వామ్రాజ్యాధిపత్యాన్ని చేపట్టాడు.

15, 16 శతాబ్దాలలో శ్రీకృష్ణదేవరాయలవారు శ్రీకాకుళము (కృష్ణాజిల్లా) వచ్చినప్పుడు యీకూచిపూడి వారి నాట్యకళ కచ్చరువంది తనతో కొంతమంది విద్వాంసులను తీసికొని వెళ్ళి హంపీలో నాకరంగ స్థలమును నిర్మాణము చేయించి నాటకము లాడించుచుండెడివారని హంపీ చరిత్రియందు పేర్కొనబడియున్నదీ..."

"విజయనగర స్వామ్రాజ్యమున శ్రీకృష్ణదేవరాయల కాలమున కూచిపూడి భాగవతులక్కడకుపోయి యా రాజుచే సత్కరింపబడినట్లు "తాయికొండ" నాటక ప్రదర్శనమునకై చేయబడిన దాన శాసనము కూడా తెల్పుచున్నది."

వీనిని జూడ శ్రీకృష్ణదేవరాయలు కూచిపూడి నాట్యకళాకౌశలమును తిలకించి పులకించెనను విషయం స్పష్టమౌతోంది. అందువలనే కాబోలు తన అముక్తమాల్యదలో...

"ఉలిపొల్పట్టిన..." పద్యమునందు "భుకుంసులు" అను పదమును ప్రయోగించెను. "భుకుంసులు... స్త్రీ వేషములు వేసి ఆడెడి పురుషులు" (శబ్దరత్నాకరం) పురుషులు స్త్రీ వేషం ధరించు సంప్రదాయం కూచిపూడి నాట్యమేళములందు వినావేరెక్కడ కన్పించదు. కావున శ్రీకృష్ణదేవరాయలచే పేర్కొనబడిన భుకుంసులు కూచిపూడి భాగవతులనుట స్పష్టం.

శ్రీ కృష్ణ దేవరాయలును రసమయ జగత్తునకు తీసుకొనిపోయిన కొద్దిమంది కళాకారులలో కేశవభట్టు ఒకడు. అంతేకాక రాయలచే ముదిగొండ అగ్రహారంతో ఘనంగా సన్మానింపబడ్డాడు కేశవభట్టు.

# పండిత జగన్నాధరాయలు కూచిపూడి నాట్యం:

కేశవభట్టు మహాలక్ష్మల కొడుకు పేరు భట్టు. పేరుభట్టు శ్రీ లక్ష్మల పుత్రుడు పండిత జగన్నాధరాయులు కూచిపూడిలో పండిత జగన్నాధరాయలు వేదాంతంవారి ఆడపడుచు (కామేశ్వరి)ని వివాహమాడెనని కామేశ్వరియే లవంగియనియు "వీరకంకణం" నవలలో శ్రీ బులుసు వెంకటరమణయ్యచే చిత్రీకరింపబడింది.

# రాజకళింగ గంగు కూచిపూడి నాట్యం:

"వేములవాడ భీమకవి శాపముచే రాజకళింగ గంగు రాజ్యభ్రష్టుడై తిరుగాడుచు తిరిగి శాపవిముక్తిని బొందిన తరువాత పరరాజులను జయించుటకై కూచిపూడి భాగవతులతో కలిసి "కళింగ గంగు రాజ్యచ్యుతి" యను నాటకమునాడి తిరిగి వేషధారణలో నున్న కళింగ గంగే శత్రురాజును సంహరించి "రాజ్యముచేసి కొనినట్లు చెప్పుచున్నవి."

# వలసపోయిన కూచిపూడి నాట్యం:

క్రీ.శ. 1565 లో తళ్ళికోట యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్యం పతనమైంది. తంజావూరులో నాయకరాజుల పాలన ఆరంభమైంది. క్రమంగా విజయనగర వైభవ తమిళనాడులోని తంజావూరుకు వలసపోయింది. నాయకరాజుల ఆస్థానాలు లలిత కళలకు నివాసస్థానాలయినాయి.

అచ్యుతప్ప నాయకుని కాలంలో కూచిపూడినుండి కొందరు కళాకారులు రాజాశ్రయం సంపాదించుటకు తంజావూరుకు వలస పోయారు. ఈ వలసపోయిన కళకారులందరూ మేలట్టూరున (మేళాలవూరున) స్థిరనివాస మేర్పరచుకొని అచ్యుతప్ప నాయకుని తమ నాట్య కళాకౌశల్యముచే మెప్పించి మేలట్టూరును అగ్రహారంగా

పొందారు వచ్చి అచ్యుతపురంలో బహుముచ్చటయిన నవమండపంబున నిందు కొలువుననుండెను'' అని కూచిపూడివారి ప్రహ్లాద పట్టాభిషేక వ్యస్తవృత్యాంశ శబ్దం. మేలట్టూరులో కూచిపూడిలోని వంశనామములు కలవారు నేటికీ కలరు. ఈ విధంగా కూచిపూడినుండి తంజావూరుకు నాట్యకళ వలసపోయింది.

అంతేకాదు, ''ఆంధ్రప్రదేశమునుండి యే యక్షగానమటు తంజావూరాది దక్షిణ ప్రాంతములకును, నిటు తెలంగాణామునకు విస్తరిల్లినది. తంజావూరు రాజ్యమున నా కాలమున వలసపోయిన యాంధ్రులలో కూచిపూడి వంశమునకు చెందిన మేలత్తూరు వెంకటరామశాస్త్రి) అచ్చట స్థిరనివాసమేర్పరచుకొనెను. అతడా మండలంలోని దేవాలయములలో ప్రదర్శించుటకు 1750...1755 ప్రాంతమున తెలుగులో ప్రహ్లాద, రుక్మాంగద మార్కేండేయచరిత్ర), ఉషాపరిణయము మొ: యక్షగానములను రచించెను.

## అబుల్ హసన్ తానీషా... కూచిపూడి నాట్యం:

క్రీ.శ. 1672...87లో ఆంధ్రదేశంలోని కృష్ణామండలం గోల్కొండ నవాబైన అబుల్ తానీషా పాలన క్రిందకు వచ్చింది. 1685 సం.లో అబుల్ హసన్ తానీషా మచిలీపట్టణమునకు ప్రయాణంచేస్తూ కూచిపూడిలో ఒక మజిలీచేశాడు. తానీషా కళా పోషకుడుగా పేరుపొందాడు.

కూచిపూడి భాగవతులీ విషయాన్ని తెలుసుకొని తానీషానుదర్శించి అతని సమక్షంలో సమాహార కళాఖండం, వడగట్టిన అలంకార భరతశాస్త్రం భావ, రాగ, తాళ నిలయం, శ్రీ కృష్ణచిద్విలాసం. శ్రీ సిద్ధేంద్రయోగి విరచితం అయిన ''భామాకలాపం''ను ప్రదర్శించారు. వీరి ప్రదర్శనకు ముగ్ధుడయిన తానీషా సుమారారువందల ఎకరముల విస్తీర్ణంలోగల కూచిపూడి మాగాణిని కూచిపూడి భాగవతులకు దాన

వి(కయ హక్కు భుక్తములతో, వంశపారంపర్యముగా అనుభవించేటట్లు ''ఫర్మానా'' యిచ్చాడు. ఈ ఫర్మానా భాగవతుల యజ్ఞన్న, నరసన్న, సూరన్నల పేరుతో వుంది. నాటి (ప్రదర్శన వీరు ముగ్గురితో కూడిన మేళం (ప్రదర్శించి వుంటుంది. ఇది కూచిపూడి అ(గహారోత్పత్తి ఉదంతం.

కూచిపూడి భాగవతులు తమ కళానాధారముగ జేసుకొని సాంఘిక (ప్రయోజనం సాధించుట యిది రెండవసారి.

## బనగానపల్లి నవాబులు... కూచిపూడి నాట్యం:

భాగవత కళను రాయలసీమలో విరివిగా (ప్రచారం చేయాలన్న తలంపుతో (క్రీ.శ. 1700...1750 (ప్రాంతంలో బనగానపల్లి నవాబుగారు కూచిపూడినుండి కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి కోరుకొండ కప్ప(టాల వద్ద వారికి భూములూ పు(టా యిచ్చి వారిచేత కర్నూలు జిల్లాల్లో భాగవత కళా (ప్రచారాన్ని (ప్రోత్సహించారు. అప్పటిలో కూచిపూడి నుండి తరలి వెళ్ళిన వారిలో చల్లావారొకరు వీరు వెలనాటి (బ్రాహ్మణులు, ఈ విధంగా కూచిపూడినుండి నాట్యచార్యులు, కర్నూలు, తంజావూరు మండలాలకు వలసపోయారు.

## కూచి మంచి జగ్గకవి... కూచిపూడి నాట్యం:

(క్రీ.శ. 18 శతాబ్దానికి చెందిన కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాసం ''రచించాడు., అందు ''ఆడు భాగవతుని జాడ జూడ నున్నగా మూతి గొరిగించుకొన్నవాడు'' అని ఈ శతాబ్ది వాడయిన తురగా

రామకవి భాగవతుల బుచ్చిగానిని స్త్రీ పాత్రధారిగా పేర్కొన్నారు. దీనిని చూడ పురుషులు స్త్రీల భూమికలు ధరించుట నాడూ కూచిపూడి మేళములోనే చూడగల్గుతాం.

ఈ విధంగా భారతీయ సంస్కృతికి సత్సంప్రదాయలకు పట్టుకొమ్మయైన కూచిపూడి నాట్యం చరిత్ర పుటల్లో అత్యున్నత స్థానమాక్రమించుట ఆరుకోట్ల ఆంధ్రులకు గర్వ కారణమన్న నతిశయోక్తి కాదు. భారతదేశంలోని యితర నాట్య సంప్రదాయాలకన్న పురాతనమైంది, కూచిపూడి నాట్యమనుటకీ వ్యాసమొక ఉదాహరణ. అంతేకాదు. కూచిపూడి భాగవతులు నాట్యకళను సాధనంగా చేసికొని సాంఘిక ప్రయోజనం సాధించారనటానికిది పరమోదాహరణం.

# కూచిపూడి నాట్య క్రమ వికాసం

ఆంధ్రదేశమందు శాస్త్రీయ నాట్యకళ ప్రాదుర్భవించి విస్తరించిన తీరును పరిశీలించి రెండు విధాల విభజించారు. ఒకటి నట్టువమేళములు, రెండు నాట్య మేళములు. ఈ నట్టువ మేళములందు కేవలం స్త్రీలు ఉపయుక్తులు. ప్రయోక్తలుమాత్రం పురుషులుందురు. ఇదిలాస్యమునకు చెందియుండును. ఇక రెండవది నాట్యమేళములు ఇందు ప్రయోక్తలు, ప్రదర్శకులు అందరూ పురుషులే. ఇది తాండవ పద్ధతికి చెందినది. నట్టువ మేళములు తిరిగి రెండువిధాల విభజింపబడ్డాయి. 1. దేవదాసీ సంప్రదాయం. 2. రాజనర్తకీ సంప్రదాయం. ఇందలి దేవదాసీ సంప్రదాయం పునఃరెండు విధాలుగా వింగడింపబడింది. అదొకటి ఆరాధనా లేక పూజానృత్యాలు, రెండు కేళికానృత్యాలు. ఈ ఆరాధనా లేక పూజా నృత్యాలు ఆలయములలో విగ్రహ సన్నిధానంలో నిత్య దూపదీప నైవేద్య అర్చనలతోపాటు ''నృత్యం దర్శయామి'' అని నృత్యంతో దేవుని సేవించుట. అంతేకాక ఉత్సవములు తిరునాళ్ళ సమయంలో బలిపీఠంపై నృత్యం చేయుట. కేళిక కేవలం కళ్యాణమంటపాలలో మేజువాణీ మేళం వినోదం కొరకూ కాలక్షేపం కొరకు ఏర్పడినవి. అందరూ పురుషులే ఉపయుక్తులైన నాట్యమేళమే కూచిపూడి భాగవతుల నాట్యమేళం.

కూచిపూడి అనే కుగ్రామం ఆంధ్రుల జాతీయ నాట్యకళకు పుట్టినిల్లు. కూచిపూడి నాట్యకళ భారతీయ సంస్కృతి, సాంప్రదాయాలకు ప్రతీక. కూచిపూడి మాగాణంపై నాట్యకళ పొందిన క్రమ వికాసాన్ని వివరించుటే ఈ వ్యాసోద్దేశం.

## కూచిపూడి భాగవతులు:
## సంస్కృత రూపకాలు

కూచిపూడి కళాకారులు రంగస్థలం ప్రవేశించు సమయానికి...

రంగస్థలం సంస్కృత రూపకాలతో అలరారుతోంది. కూచిపూడి కళాకారులు ''ఛండకౌశికం'', ''ఉత్తర రామచరితం'', ''వేణీ సంహారం'', ''మృచ్ఛ కటికం'', ''శాకుంతలం'' 'విక్రమోర్వశీయం' మొదలగు రూపకాలను భావ... రాగ... తాళ లయాభిజ్ఞమైన

భరతముతో మేళవించి

ప్రయోగించి ప్రచారం చేయుటచే కూచిపూడి కళాకారులు భాగవతులయ్యారు.

## సిద్ధేంద్రయోగి భామాకలాపం

క్రీ.శ. 13, 14 శతాబ్దాలలో కూచిపూడిలో సిద్ధేంద్రుని భామాకలాపం ఆవిర్భవించింది. సిద్ధేంద్రుని భామాకలాపం భావజ్ఞానానికి, రాగజ్ఞానానికి, తాళజ్ఞానానికి ఠవు. అందువలననే విశ్వనాధవారు తమ ఏకవీరలో... ''భామాకలాపం వడగట్టిన యలంకార భరతశాస్త్రమని'' పేర్కొన్నారు. అంతేకాదు. భామాకలాపం భరతశాస్త్రానికి లక్ష్య, దృశ్య ప్రబంధం. సిద్ధేంద్రయోగి భామాకలాపాన్ని రచించి, ఆడి పాడి, భరత విద్యార్థులందరు స్వగ్రామా వాసులకు నేర్పి అన్వర్థ కులపతియైనాడు. సంస్కృత రూపక మర్యాదలను, భరత లక్షణములను జీర్ణించుకున్న కూచిపూడి భాగవతులు భామాకలాప ప్రయోగంతో పరాకాష్టకు చేరారు.

భామాకలాపాన్ని సిద్ధేంద్రయోగి ముచ్చటగా మూడు పాత్రలతో ముగించాడు. అవి సత్యభామ, శ్రీకృష్ణుడు, మాధవి. భామాకలాపమొక అలౌకికకానందప్రదాయి. అదొక అపూర్వ కలాప ప్రక్రియా ప్రభేదం. అదొక శృంగార, హాస్యరస బంధుర ప్రబంధం. దానికదేసాటి.

## గొల్ల కలాపం!

## భాగవతుల రామయ్య

కూచిపూడి భాగవతులు ''భామాకలాపం'' తరువాత

గొల్లకలాపం'' ప్రదర్శించుటారంభించారు. ఈ గొల్లకలాపంలో కూచిపూడి పురవాసి "నాద బ్రహ్మ" శ్రీ భాగవతుల రామయ్య "యజ్ఞపట్టు" అనునొకఘట్టం రచించి ప్రక్షిప్తమొనర్చారు. ఇదొక వేదాంత దృశ్య కావ్య కళాఖండం. బ్రహ్మజ్ఞానాన్ని సామాన్య జనావళికి అందించు ప్రయత్నంలో కూచిపూడి భాగవతులకి గొల్లకలాపం సాధనమైంది. భాగవతులు ఈ ప్రయత్నంలో సఫలీకృతులయినారు.

## కూచిపూడి యక్షగానం:

## చింతా వెంకటరామయ్య

కూచిపూడి యందీ భాగవత కళను ప్రచారం చేయించుచు మనుగడ సాగించు కళకారుల సంఖ్య కాలక్రమమున అధికం కొజొచ్చింది. అపూర్వమైన కాలక్రమమున అధికం కాజొచ్చింది. అపూర్వమైన వీరి పరిశోధనా ఫలితమే కూచిపూడియందు

యక్షగాన సరస్వతీ సమారంభం శ్రీ వెంకటరాయ్య నవనవోన్మేష ప్రతిభాశాలి.ఉపరి... సంగీత సాహిత్య నాట్య శాస్త్రవేత్త అసమాన శేముషి ప్రజ్ఞాదురంధరుడు. వీరు రచనా విధానమున దేశీయములైన యక్షగానాల్ని తీసుకుని, భావ, రాగ, తాళ, అయాభిజ్ఞమైన భరత విద్యతో పరిష్కరించి ప్రయోగింపజొచ్చిరి. ఆంధ్రదేశంలో నేటికీ యక్షగానం సజీవమై అలరారుటకు వీరే ప్రధాన కారకులు. వీరి ప్రయోగం పండిత పామర జనరంజకం.

శ్రీ వెంకటరామయ్య తొలుత ప్రహ్లాద చరిత్రము, ఉషాపరిణయం, శశిరేఖా పరిణయం, విరాటపర్వం మొ. నాటకములను స్వీకరించి, వాటికి సుప్రసిద్ధ కర్ణాటక రాగములతో సందర్భోచితముగా, పాత్రో చితముగా, రసోచితముగా, సాంప్రదాయరీతిలో శ్రవణానందముగా సంగీతమునూ, నయనానందముగా నాట్యమును ఏర్పరచి, శిష్యులకు శిక్షణవిచ్చి ప్రయోగించారు. వీటిలో కీలకమైన సూత్రధారునిపాత్రతోపాటు నారదుడు, వాల్మీకి, ఇత్యాదిపాత్రలు

పోషించి తరువాత తరం వారికి మార్గదర్శకులయినారు. యక్షగానాలతో కూచిపూడి నాట్యకళను సుసంపన్నం చేసి... తమిళ, కేరళ కర్ణాటక రాష్ట్రములలోకూడా కూచిపూడి కళకు ఖ్యాతి తెచ్చారు.

## య క్ష గా న ం:

## చింతాకృష్ణమూర్తి

శ్రీ చింతా వెంకటరామయ్యగారి తరువాత కూచిపూడి యక్షగానాన్ని సుప్రతిష్ట మొనర్చి వెంకటరామ నాట్యమండలి కధినాధులై, యక్షగాన సూత్రధారులై, యక్షగాన నాయక పాత్రధారులై; ప్రయోక్తలై; నాట్యాచార్యులై భారతదేశమంతటా కూచిపూడి యక్షగాలములను ప్రదర్శించి భరత కళా 'ప్రపూర్ణ'లై శ్రీ చింతా కృష్ణమూర్తి ఘనతపొందారు.

## య క్ష గా న ం:

## సత్యనారాయణ శర్మ

శ్రీ చింతా కృష్ణమూర్తి తదనంతరం శ్రీ వెంకటరామ నాట్యమండలి కధ్యక్షులై యక్షగానములందు ఉష, భామ, దేవదేవి యిత్యాది నాయిక పాత్రధారులై యక్షగానాల్ని నేటివరకు భారతదేశమంతటా ప్రదర్శిస్తూ, గురువును మించిన శిష్యుడుగా 'పద్మశ్రీ' సత్యనారాయణ శర్మ జైత్ర కళాయాత్ర చేస్తున్నారు.

## ఏకపాత్ర కేళికలు:

## లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీ చింతా వెంకటరామయ్యగారి సమకాలికులు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ శాస్త్రి కూచిపూడి వ్యష్ఠ నృత్యాంశములనబడు ఏకపాత్ర కేళికలకు చక్కని రూపములనొసంగి శాస్త్రీయ అభినయ పద్ధతిలో ప్రచారం గావించారు. శ్రీ శాస్త్రి

ఏకపాత్ర కేళికలకారంభకులు. శ్రీ శాస్త్రి జయదేవుని అష్టపదులు; నారాయణ తీర్థులవారి తరంగములు; క్షేత్రయ్య, సారంగపాణి పదములనేగాక, సంస్కృత గ్రంథాతర్గత శ్లోకముల నభినయించుటయం దందె వేసిన చేయి... శ్రీ శాస్త్రి జతి స్వరము. జతకట్టు, స్వరపల్లవులు, కౌత్తములు, తిల్లానాలు, జావళిలు, శబ్దములు, యిత్యాది వ్యస్థ నృత్యాంశములైన ఏకపాత్ర కేళికలకు చక్కని రూపం యిచ్చి భరతముని నాట్యశాస్త్ర సంప్రదాయ చోదితముగ అభినయమేర్పరచి భారతదేశమంతటా సహస్రాధిక శిష్యులకు శిక్షణ గరపి, ప్రచారం చేశారు. నేడు వ్యష్టముగ ప్రదర్శించు కూచిపూడి నృత్యాంశాములన్నియు శ్రీ శాస్త్రిగారి బాణీకి అనుసారులు, మానసపుత్రికలు.

## నృత్య నాటికలు... డా. శ్రీ వెంపటి చినసత్యం

కూచిపూడి కళాక్షేత్రమున యక్షగానం ఏకపాత్ర కేళికల తరువాత ప్రముఖముగా ప్రధాన స్థానమాక్రమించుచున్నది. నృత్యనాటిక ప్రక్రియా భేదము. ఇవి యక్షగానాలకి మానసపుత్రికలే. ఈ నృత్య నాటిక ప్రక్రియ ప్రపంచ పరమేష్ఠి శ్రీ వెంపటి చినసత్యం.. శ్రీ చినసత్యం నృత్యనాటిక ప్రయోక్త. వీరు కొత్తపాతల మేలు కలయికలతో తొలుత శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగార్ల కృత క్షీరసాగర మథనము గావించి ఆంధ్రావళికి అమృతాన్ని అందిచారు. తరువాత శ్రీ యస్వీ భుజంగరాయశర్మ విరచిత 'శ్రీ కృష్ణ పారిజాత' పరిమళములను పరివ్యాప్తమొనర్చారు. తరువాత 'విప్రనారాయణ చరిత్ర' 'కల్యాణ శాంకుంతలం' మేనకా... విశ్వామిత్ర, శ్రీనివాస కల్యాణం, చండాలిక, కల్యాణ రుక్మిణీ, హరవిలాసముల నృత్యనాటికలకు రూపమిచ్చి ప్రపంచమంతా ప్రచారం

చేస్తున్న ప్రముఖ నృత్యనాటిక సృష్టికర్త శ్రీ వెంపటి చినసత్యం. ''శ్రీనివాస కల్యాణం'' అపూర్వ కళాఖండం, అద్భుత శిల్పం. ఆనందప్రదాయిని. ఇవన్నీ శ్రీ చినసత్యం కీర్తిప్రతిష్ఠలకు జయపతాకలుగా నిలిచాయి. నవనవోన్మేషమైన ఆయన ప్రతిభకు, కళాకౌశాలానికి నికషోపలాలు. తమిళమునందు కూడా ''కుమారసంభవము'', ''శ్రీనివాస కల్యాణం'' నృత్యనాటికలను ప్రయోగిస్తూ కూచిపూడి కళామతల్లికి తన జీవితము నంకితం జేసుకున్న కళాకారుడు శ్రీ చినసత్యం.

ఈ విధంగా కూచిపూడి నాట్యకళ సంస్కృత రూపకాలతో ఆరంభమై సిద్ధేంద్రుని భామాకలాప పారిజాత పరిమళాలను పరివ్యాప్తమొనర్చి, గొల్లకలాపముతో జ్ఞానప్రదాయియై, ఏకపాత్ర కేళికలతో కూచిపూడి కళాఖేలలు నాట్యహేలలై, రసలీలలై, నృత్యనాటికలతో సామాజికుల హృదయారవిందంబులకు విందొనగూర్చుచు, ఆనందరసోత్తుంగ తరంగముల నోలలాడించుచు సర్వజన రంజకములై చైతన్య చకచ్చకితములై క్రమ వికాసం పొందుచున్నవి.

# సిద్ధేంద్రయోగి

కూచిపూడివారి యక్షగానాల్లో భామాకలాపం ప్రసిద్ధమైంది; ప్రధానమైంది. దీనిని శ్రీ సిద్ధేంద్రుడను యోగిపుంగవుడు రచించాడు. ఈ సిద్ధేంద్రయోగినిగూర్చి వీరి భామనుగూర్చి ఎందరో విద్యాధికు లెన్నెన్నో వ్యాసాలు వ్రాశారు. కాని సిద్ధేంద్రయోగి జన్మస్థలం, కాలం, జీవిత చరిత్ర వివాదగ్రస్తాలుగానే మిగిలిపోయాయి. అయితే భామాకలాప కర్త... సిద్ధేంద్రయోగి...అను విషయం నిర్వివాదాంశం. ఈ మహర్షిని, అతని భామాకలాపాన్ని గూర్చిన నా నూతన పరిష్కారమే ఈ వ్యాసం.

భామాకలాపం అవిర్భావం సిద్ధేంద్రయోగి జీవితంలో ముడిపడి ఉంది. కనుక భామాకలాప అవిర్భావాన్ని గూర్చి ముచ్చటించాలంటే ఏతత్కర్త జీవితాన్ని గూర్చి తెలుపుటయే.

సిద్ధేంద్రయోగికి యా కూచిపూడి జన్మస్థలమో లేక మాతామహస్థానమో అయి ఉంటుంది. అంతేకాని సిద్ధేంద్రునకు కూచిపూడితో అతని వివాహం తరువాత సంబంధం ఏర్పడలేదు. పూర్వాశ్రమంలో ఈతడు సిద్ధయ్య, సిద్ధప్ప అని వ్యవహరింపబడి ఉంటాడు. అసలీతని పేరు విశ్వనాథవారు పేర్కొన్నట్లు సిద్ధయ్యశాస్త్రియై ఉంటుంది. ఇతడేవంశమువాడో తలిదండ్రులెవరో తెలుపుట కాధారాలులేవు. ఈతని బాల్యానికే కూచిపూడి భాగవతులు భరత విద్యాధురంధరులగుటచే వారి నాట్యకళ కాకర్షితుడై చదువు సంధ్యలులేక ఆకతాయితనంగా వారితో తిరిగి ఉంటాడు. చదువు, సంస్కారము, లేదని కాలచక్రం ఆగదుగదా! సిద్ధయ్య యౌవన వయస్కుడయ్యాడు. ఆనాడు కూచిపూడి అగ్రహారంలోని ఒక బీద బ్రాహ్మణుడు తన కుమార్తెకు తగిన వరాన్వేషణలో విసిగివేసారి తుదకీ సిద్ధయ్యకీయ సంకల్పించాడంటారు కొందరు. ఈ బీద బ్రాహ్మణుడు కూచెయ్య అని అంటారు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు

ఈయన కూచెయ్యయో మరి మాచెయ్యయో చెప్పుట కాధారాలేవి?

చదువు సంధ్యలులేక సోమరిగ మందబుద్ధిగ తిరుగాడు సిద్దయ్యకు తన తనయ నిచ్చుటకొక గృహస్థు ఇచ్ఛగించినాడంటే ఈతనికి సిద్దయ్యకీ ఏదో ఒక సంబంధం బాంధవ్యముండితీరాలి. అలా కాకపోతే దారినపోయే ఈ దానయ్య (సిద్దయ్య)కు ఎందులకిచ్చును? ఇచ్ఛగించినచో యా సిద్దయ్యేగాక ఈ తరగతికి చెందిన వారింకెంతమందిలేరు? కావున సిద్దయ్యకు ఆ గృహస్థునకు ఏదో దగ్గర బంధుత్వముగాని లేక కనీసం దూర బంధుత్వముగాని ఉండి ఉంటుంది. అందువలననే తన కుమార్తెనీయ సంకల్పించాడు. సిద్దయ్య పెండ్లి విషయం అతని మిత్రబృందానికి తెలిసింది. 'తాదూర బొక్కలేదుగాని మెడకో డోలు' అన్నట్లు కుడువటానికి కూడు; ధరించటానికి గుడ్డ; నివసించటానికి యిల్లు లేకపోయినా పెండ్లికావలసి వచ్చిందా... అని పరిహసించి ఉంటారు. ఈ విషయం ఆ గృహస్థుకి తెలిసి ఉంటుంది. కాని లోకులు పలుకాకులు అని వారి మాటలు లెక్కపెట్టక ఆ బీద బ్రాహ్మణుడు 'అష్టవర్షాభవేత్కన్య' అను ఆర్యోక్తికి దీటుగా సిద్దయ్యకు తన కూతునిచ్చి వివాహం చేశాడు. సిద్దయ్య భార్య కోద్దోగొప్పో చదువు సంస్కారంకల గృహిణి అగుటచే ఈతడు మనస్సులో తన విద్యా విహీనతకై చిన్నబుచ్చుకొని ఉంటాడు. 'మోదకైస్తాదయ' అన్నట్లుంది సిద్దయ్య అవస్థ. అటు మిత్రుల అవహేళన, ఇటు అర్ధాంగి అధికృత. ఈ స్థితిలో సిద్దయ్య మానసిక సంఘర్షణ పొంది ఆలుతో అత్తమామలతో చెప్పో చెప్పకో విద్యాభ్యాసానికై పయనమై కృష్ణదాటి అక్కడనుండి ఎక్కడికోపోయి ఉంటాడు. స్వగ్రామంలో విద్యాధికులకు లోటులేదుగదా! అక్కడే సిద్దయ్య విద్యాభ్యాసం చేయవచ్చునుగదా! కాని అభిమానం అడ్డుపడి ఉంటుంది. ఎక్కడికోపోయి ప్రముఖ విద్వాంసునెవరినో ఆశ్రయించి ఉంటాడు. విద్యాభ్యాసంలో కొన్ని సంవత్సరాలు గడిచి ఉంటాయి. కావ్యాలు కంఠస్తంచేసి ఉంటాడు. వేదాల్ని వల్లెవేసి ఉంటాడు. శాస్త్రాలు పఠించి ఉంటాడు. బాల్యంలోనే ఈతని మనస్సులో

తిష్ఠవేసిన నాట్యకళకు లక్షణ గ్రంథమైన నాట్యశాస్త్రాన్ని అవగత మొనర్చుకొని ఉంటాడు. పద్గ్రంథముల పారచదివినవాడు ఊరక ఉండడుగదా! అప్పుడే ఏవో అల్లిబిల్లి కవితలనల్లి ఉంటాడు, అవి కాలగర్భంలో కలిసి ఉంటాయి. కానీ తానవ గత మొనర్చుకొనిన లక్షణ గ్రంథమునకు లక్ష్యముగ నొక గ్రంథాన్ని వ్రాయ సంకల్పించి ఉంటాడు. ఇతివృత్త నిర్ణయమొక సమశ్య అయి ఉంటుంది. ఏదైతేనేమి కాలం కలిసిరాలేదు. విద్యాభ్యాసం పూర్తి అయ్యేసరికి యౌవనం వచ్చి ఉంటుంది సిద్దయ్యకు. సిద్దయ్య సిద్ధేంద్రుడై గురువుగారి అనుమతితో గృహాన్ముఖుడై ఉంటాడు. కృష్ణానదీ తటానికి చేరి ఉంటాడు. అక్కడ ఎవరో పరిచితులో ఆప్తులో అతని భార్య రజస్వల యైనదని చెప్పారు. ఇంకేముంది సిద్ధేంద్రునకు ఉషారు ఉరుకలేసింది. అది బహుశః శ్రావణం అయి ఉంటుంది. కృష్ణవేణి ఆనందానికి అవధులులేవు, అయినా ఎవ్వరేమనుకుంటారో అవధులు దాటితేనని కట్టలకు సమానంగా ప్రవహిస్తోంది. కృష్ణవేణి తరంగాలమీదుగ వస్తున్న మందమారుతాలు సిద్ధేంద్రుని మనస్సును పరి పరి విధాల పరుగులు తీయిస్తున్నాయి. అతని స్మృతిపథంలో అర్ధాంగి కదలాడి ఉంటుంది. కొన్ని వసంతాలు విద్యాభ్యాసంలో గడచాయికదా! ఇప్పుడామె షోడశ కళా పరిపూర్ణుడైన నిండు చందురునివలె నిండు జవ్వనియను తలపు వచ్చింది. దానితో అతనికి ఈ కృష్ణవేణిని దాటుట ఒకలెక్క అనిపించి ఉంటుంది. 'కామాతురాణాం నభయం నలజ్జా, అను ఉక్తికి లక్ష్యముగ సిద్ధేంద్రుడు కృష్ణ ఉరకల లయల వేగాన్ని గమనించకుండానే అడ్డుపడి ఈదులాటారంభించి ఉంటాడు. ఈదీది కాలుసేతులలోని శక్తి క్షీణించి ఉంటుంది. కృష్ణవేణి ప్రవాహానికి తట్టుకొనలేక కొట్టుకొనిపోయి ఉంటాడు. మరణం అవశ్యం అనుకొని ఉంటాడు. 'యోగేనాన్తే తనుత్యజాప్ః' అను కాళిదాసోక్తి సిద్ధేంద్రుని మానసిక ఆకాశంలో మెరపువలె మెరసి ఉంటుంది. ఆతురతతో సన్యసించి ఉంటాడు. వానప్రస్థాశ్రమం స్వీకరించు వయసు రాకముందే ప్రమాదంవశాత్తు సన్యసించి ఉంటాడు. సిద్ధేంద్రుడు సిద్ధేంద్రయోగి యైనాడు. తలవనితలంపుగానాడే కృష్ణాష్టమి అయి ఉంటుంది.



భామా కలాపకర్త

శ్రీ సిద్ధేంద్రయోగి

ఊహా చిత్రకారుడు : శ్రీ కోటేశ్వరరావు

ద్వాపరాన గజేంద్రుడు 'లావొక్కింతయు లేదు' అనినట్లుగా భగవంతునిపై భారంవేసి

'అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణంమమ
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దన'

అని ఉంటాడు. భగవదనుగ్రహించే కూచిపూడి అగ్రహారీకుల అదృష్టంచే ఏదో ఆధారం దొరకి ఉంటుంది. ప్రాణాలు కాపాడుకొని బ్రతుకుజీవుడా అని బయలుదేరి ఉంటాడు.

సిద్ధేంద్రుడాగ్రామంలో ప్రవేశించు చుండగానే ఒక మధుర దృశ్యం అతని కంట పడింది. ఒక పదునారేళ్ళ పడుచు పసుపాడి తడి వస్త్రాలతో భుజాన మంచి నీటి బిందె ధరించి గృహోన్ముఖురాలౌతోంది. ఈ సన్నివేశం మన సిద్ధేంద్రునకు మనోవికారాన్ని కలుగజేసి ఉంటుంది. తన భార్యకూడ యిట్లే ఉందునుగదా! అని ఈమే నా భార్యయైన... ఒక్క ముహూర్తకాలం ఊహా ప్రపంచంలో తేలియాడి ఉంటాడు. సిద్ధేంద్రుడు. సిద్ధేంద్రుని అగమనం తెలిసి అతని మామ యోగక్షేమాలు తెలిసికొనుటకు వచ్చి తన యింటికి ఆహ్వానించాడు, 'ప్రమాణ మంతః కరుణ ప్రవృత్తయః' అన్నట్లు సిద్ధేంద్రుని మధుర దృశ్యంలోని లావణ్యవతి ఎవరోకాదు అతని అర్ధాంగియే.

తరువాత కొలది దినాలకు నిషేక ముహూర్తమని ఉంటారు. నాటి రాత్రి శయనగృహము చేరినాడు సిద్ధేంద్రుడు. కాని సిద్ధేంద్రుని యందు గృహస్థు లక్షణాలకు బదులు యోగి లక్షణాలుగాంచి ఆ పతివ్రతా శిరోమణి శయిన గృహం వీడి వెలుపలకు వచ్చి తల్లిదండ్రులకు ఈ విషయం వివరించింది. ఇది వాడుకలో ఉన్న కథ. ఇదియేవాస్తవమైన విశ్వనాథ వారన్నట్లు ఆమె అంతర్దృష్టియే. వారా విషయమై సిద్ధేంద్రునడిగారు. అంత సిద్ధేంద్రునకు తన సన్యాస విషయం జ్ఞప్తికి వచ్చిందనుట కంటే నిషేక ముహూర్తమని సిద్ధేంద్రుని అతని మామగారు సంప్రదించి వచ్చినపుడుగాని లేక అతఃపూర్వం యోగక్షేమాల నరయ వచ్చినపుడుగాని సిద్ధేంద్రుడే తన ప్రయాణమును గూర్చి, తత్ మధ్యస్థమయిన ప్రమాదాన్ని గురించి.

తాను సన్యసించిన విషయాన్ని గురించి వివరించి ఉంటాడనుట ఉచితం. కారణమేమనగా జీవితంలో మరపురాని జీవన్మరణ సంఘటన సంభవించింది కదా! అదికూడా కొద్దిరోజుల క్రితమే కదా! కనుక సిద్ధేంద్రుడే తన సన్యాస విషయం వివరించి ఉండును. కాని పదునారేండ్ల పడుచును కాంచగానే ఒక ముహూర్తకాలం అతని మనస్సు వికారం చెంది ఉంటుంది. వెనువెంటనే తన సన్యాస విషయం జ్ఞప్తికి వచ్చి ఉంటుంది. మనో నిగ్రహం పొంది ఉంటాడు. ఇచ్చటనే భావసంఘర్షణ ఆరంభమైంది. ఇటు యౌవన వయసున సన్యసించుట అటు సర్వాంగసుందరి సంసిద్ధంగ ఉండుట. ఇటు యోగశక్తి అటు లౌకిక శక్తి. కడకాతని యోగత్వమే జయించింది. కాని దుర్భర విరహం అనుభవించి ఉంటాడు. పునఃభగవంతుని జ్ఞప్తికి దెచ్చుకొని బ్రతుకు నిచ్చిన ఓ భగవంతుడా! ఈ జీవితాన్ని చరితార్థ మొనర్చుకొనుటకు మనోనిగ్రహం ప్రసాదించమని అతని యిష్టదైవమైన ఆ శ్రీకృష్ణభగవానునే త్రికరణ శుద్ధిగ ప్రార్థించి ఉంటాడు. ఏ

ఇక సిద్ధేంద్రయోగి భామాకలాప రచన కుపక్రమించి ఉంటాడు. సర్వప్రాణి కోటికి అనుభవైక వేద్యమైంది, రసరాజమైంది శృంగార రసం. అందున విప్రలంభ శృంగార పరీమోత్కృష్టమైంది. భామాకలాపం ఒక శృంగార సాగరం, సిద్ధేంద్రయోగి శాస్త్రవేత్త, ఉపరి రుషితుల్యుడు. 'నాన్వషిః కురుతే కావ్యం' అన్న ఆర్యోక్తిని అన్వర్థమొనర్చాడు. 'భామాకలాపం' రచించాడు. మధుర భక్తిని ప్రతిపాదించాడు. అద్వైతాన్ని అందించాడు. ఆత్మీయతను ప్రతిఫలింప జేసుకొన్నాడు. జీవాత్మ పరమాత్మను జేరుటకై బొందు విరహామే సత్యభామ కృష్ణుని చేరుటకుపొందిన విరహం. సిద్ధేంద్రయోగి తన విరహాన్ని తాకిన దృష్టి నుండి అలౌకిక దృష్టికి మళ్ళించుకొన్నాడు. నిజంగా యీ భామాకలాపం ఆవిర్భావం కూచిపూడి భాగవతుల కొకమహోదయం. సిద్ధేంద్రయోగి తన భామాకలాపాన్ని భరత విద్యావేత్తలయిన స్వగ్రామవాసులకు నేర్పి కులపతియైనారు. 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అను ఆర్యోక్తికి గీటుగ తాను తరించి

ఋతరులను తరింప జేశాడు. జన్మభూమి ఋణం తీర్చుకొన్నాడు. ఇవి భామాకలాప ఆవిర్భావానికి హేతువు.

## సిద్ధేంద్రుని కాలం:

శ్రీ సిద్ధేంద్రయోగి 13 లేక 14 శతాబ్దములకు చెందినవాడని శ్రీ పి.యస్.ఆర్. అప్పారావుగారి అభిప్రాయం.

## భామాకలాపం... ఇతివృత్తం... ప్రదర్శనావిధానం

భామాకలాప మందలి యితివృత్తానికి పారిజాతాపహరణానికి ఎట్టి సంబంధం లేదు. భామాకలాప మందు సత్యభామాకృష్ణుల ప్రణయం కథా వస్తువు. అంతంలో సత్యభామాకృష్ణుల పునఃసమాగమం.

ఈ యక్షగానం మూడు రాత్రుల ప్రదర్శనకుద్దిష్టమైంది. దీనిని ముఖ్యంగా ముచ్చటగా మూడు ప్రాంతాలతో ముగించాడు సిద్ధేంద్రయోగి. సత్యభామ, కృష్ణుడు, మాధవి. ఇందలి మాధవి సిద్ధేంద్రయోగి అపూర్వ సృష్టి. ఈ మాధవి అక్కలలో అక్క బావలలో బావ. ఇది ఏకాంకిక. ఇందు ప్రథమరాత్రి వేణి వృత్తాంతం. సత్యభామ ప్రవేశంకన్న మున్ముందుగ ఆమె వేణియే రంగస్థ అని ప్రవేశిస్తుంది. ప్రథమరాత్రి భామ దర్శనభాగ్యం ఉండదు. అటు యిటు ఇరువురు చెలులు తెరపట్టుకొంటారు. ఆ తెరపై సత్యభామ జడ మాత్రం దర్శనమిస్తూ ఉంటుంది. ఈ వేణి వృత్తాంతం ఒక రమణీయ ప్రకృష్టబంధం.

ఈ జడను శ్రీ మహావిష్ణువు దేవదానవులు క్షీరసాగరాన్ని మథించినపుడు అమృతాన్ని దేవతల కందించటానికి విశ్వమోహినిగా ఉన్నప్పుడు ధరించాడు. తరువాత సత్యభామ ధరించింది. దీనిని విశ్వకర్మ అమోఘంగా తయారు చేశాడు. ఇది అశ్వని, భరణి యిత్యాది

యిరువదియేడు నక్షత్రాలతో, సూర్యచంద్రాది నవగ్రహాలతో శోభాయమానంగా అలంకరింపబడి ఉంటుంది. ఈ ప్రథమరాత్రి ప్రదర్శన పూర్వరంగ విధులు, మేళవింపు వేణీ వృత్తాంతం ఉంటాయి.

ఇక రెండోరోజు రాత్రి 'భామనే సత్యభామనే' యనుచు 'ముఖారి' రాగంలో యక్షగాన సంప్రదాయానుసారంగా తన పేరు సామాజికులకు తెలియపరుచుకుంటూ సత్యభామ సభాప్రవేశం చేస్తుంది. ఈమె సభాప్రవేశమే 'తన స్వామిని కానక వెదుకుచూ జరుగుతుంది. అంత మాధవి సత్యభామను పలుకరించి స్వామివారు మన యింటికి రాకపోవుటకు కారణం అడుగుతుంది. అపుడు సత్యభామ ఒకానొకనాడు హంస తూలికాతల్పంబున శయనించి యుండగా స్వామివారు వచ్చి నిదురలేపి సర్వాభరణములలంకరింపజేసి 'భామా నీవే అందగత్తెవా? లేక నేనే అందగాడనా అని అడుగగా ఆడబుద్ధి అపరబుద్ధి గనుక నేనే అందగత్తెనని తెలుప స్వామి వారికి కోపము వచ్చి అలగి దిగ్గున లేచిపోయెనే ఓయమ్మ' అని తన యింటికి స్వామివారెందుకు వచ్చుటలేదో తానేవిధంగా ఆ శ్రీకృష్ణునకు దూరమైందో తెల్పుతు తన స్వామిని వెదుకుటకు మాధవి సాయం అర్థిస్తుంది. ఈ అన్వేషణలో తన స్వామిని ఏ సవతి ఏ మందు పెట్టి స్వాధీనం చేసి కొందోనని చింతిస్తుంది. సవతులను దూషిస్తుంది. ఈ ఘట్టంలో వశీకరణ ఔషధాలు వాని విరుగుడులు అనేక రహస్యాల్ని సమయోచితంగా చెప్పాడు సిద్ధేంద్రయోగి.

సత్యభామ మాధవిని ఎందుకు కానక 'ఎందుబోతివి ఎందుబోతివి ఎందుబోతివి రారా!' అని 'ముఖారి' రాగంలో ఆలపిస్తు విలపిస్తు అన్వేషిస్తుంది. ఇక తన శక్తి చాలదని గ్రహించి మాధవిని మాధవుని గొని రమ్మంటుంది. ప్రాధేయ పడుతుంది. మాధవి అతడెటువంటివాడో, ఏ రూపువాడో, ఏ రేఖవాడో శిఖనఖ పర్యంతరం వర్ణించ మంటుంది. చివరికాతని పేరు చెప్పమంటుంది. అంత సత్యభామ ఇంతోటి ఆడవారిలో, ఇంతమంది మగవారిలో సత్యభామ మగని పేరు చెప్పుట ఉచితం కాదంటుంది. సిగ్గు పడుతుంది. కాని

మన్మథుని బాధకు తాళలేక పోతూ 'మదనా మదనా మదనా యనుచును వదలలేక వాని వలలో జిక్కితినే తాళలేనే ఓయ్మా' అని ఆనందభైరవిలో ఆలపిస్తుంది. మాధవి శ్రీకృష్ణుని తోడ్కొనిచ్చుటకు ప్రతిఫలము అర్థిస్తుంది. సత్యభామ ఏడువారాల సొమ్ములకోరుకోమంటుంది. కాని మాధవి అన్నింటికన్న మిన్నయైన ముక్కు ముంగరే కోరుతుంది. ఈ ఘట్టంలో ఏడువారాల సొమ్ములు ఏతదధీన దేవతలు ఏ తద్ధారణవలని ప్రయోజనాలు వివరింపబడ్డాయి. సత్యభామ మాధవి కోరిన ముంగెర యివ్వటానికిముందు కొంత అభ్యంతరం తెలిపినా కడకు ఇచ్చుటకు అంగీకరిస్తుంది. ఇందు సత్యభామ సర్వస్వం నిలువుదోపిడి ఇచ్చి యయినాసరే తన స్వామిని రప్పించుకొనవలెనని ఆతురతతో, ఆకాంక్షతో చూస్తుంది. ఇది మరుపురాని మధురఘట్టం. ఇక్కడ మాధవిచే ఈ ఆభరణాలను అర్థింపజేయుటలో పరమార్థంలేకపోలేదు. సత్యభామ సహజ సంపదగల్గిన అహంకారిణి. గర్విష్ఠి. ఈమె జీవాత్మకు ప్రతీక. ఈమెకీ లౌకికవాసనలను తొలగింపజేయటానికే సిద్ధేంద్రయోగి ఇట్లు రచనచేశాడు. పరమాత్మను చేరుటకై విరహవేదనను పొందుతున్న సత్యభామకు ఈ ఆభరణాలొకలెక్కా!

భామాకలాపంలోని సత్యభామ అష్టవిధనాయికలలోని వాసకసజ్జిక; ఖండిత, కలహాంతరిత, విరహోత్కంఠిత, అభిసారిక వాలకము వేసినది. ఇందు విప్రలంభశృంగారం పరాకాష్ఠపొందింది. సత్యభామ విరహోద్వేగంలో నాయకుని వంశదూషణ, చంద్రదుషణ, మన్మథదూషణలను చేసింది. దశవిధ శృంగారావస్థలలో ఒకటి రెండు వినా అన్నింటినిపొందింది. అంటే చక్షుఃప్రీతినుండి మూర్ఛవరకు అనుభవించింది. అందుకనే విశ్వనాథవారు సిద్ధేంద్రుని భామాకలాపం 'వడగట్టిన యలంకారభరతశాస్త్రం' అన్నారు.

అందుకు మాధవి కోరికపై శ్రీకృష్ణునకు ఒక లేఖ వ్రాసియిచ్చింది. దీనినే ధూతికాసందేశం అంటారు. ఈ లేఖ సిద్ధేంద్రయోగి భాషాపటిమకొక మచ్చుతునక. అంతేకాదు. ఎంతో ప్రసిద్ధమైందీ లేఖ.

మాధవి శ్రీకృష్ణునికొరకు పోవుసమయంలో ఉత్తరాన ఉరుము ఉరిమింది. శుభశకునాలైనాయి. అందుచే మనోవాంఛ సత్వరంగా ఈడేరింది. ఇది సిద్ధేంద్రుని లోకజ్ఞతగా గుర్తించవచ్చు. మాధవి శ్రీకృష్ణుని తోడ్కొనివచ్చు మధ్యకాలంలో సత్యభామ నిరీక్షణ, ఆవేదన మధురాతి మధురభావన. ఈ ఘట్టం ఈ కలాపంలో గర్భసంధి వంటిది. సిద్ధేంద్రయోగి సామాజికులను రసోత్తుంగ తరంగాలలో ఓలలాడిచించాడు.

ఇక మూడవరాత్రి కథ మాధవి శ్రీకృష్ణుని దర్శించుటతో ఆరంభమౌతుంది. శ్రీకృష్ణుని దర్శించి తన వాక్చాతుర్యముచే వేగిరం తనతో వెంటబెట్టుకొని సత్యాసన్నిధికి వస్తుంది. అంత ఆవేదనపడిన సత్యభామ పునఃలౌకిక వాసనలు రేకెత్తినవన్నట్లు పరమాత్మతో సంవాదానికి దిగుతుంది. కడకు శ్రీకృష్ణుని పరమాత్మగా గుర్తించి బంగరుపూవులతో పూజచేస్తుంది.

భామాకలాపమందలి సత్యావేదనలో సిద్ధేంద్రయోగి దృశ్యమానుడౌతాడు. ఇందలి మాధుర భక్తితో భగవత్ సాన్నిధ్యం, తదైక్యం పొందినది వాస్తవంగా సత్యకాదు సిద్ధేంద్రయోగియే. సత్యభామను కేవలం సాధనంగా చేసికొన్నాడీ యోగిపుంగవుడు: తాను ప్రకృతియై సత్యారూపాన పురుషునారాధించి తదైక్యం చెందాడీ రుషితుల్యుడు.

ఏ శుభముహూర్తాన సిద్ధేంద్రయోగి తన భామకు గజ్జలు కట్టాడోగాని అవి నాటినుండి నేటివరకు ఉత్తర దక్షిణభారతాలు దాటి ఖండాంతరములోని సహృదయహృదయారవిందాలకు సహితం విందును చేస్తూనే ఉన్నాయి.

ఏ చింతనలో ఉండిన ఆ విషయం స్వప్నంలో దృశ్యమానం అగుట సహజంకదా! సిద్ధేంద్రయోగికి ఆ రాత్రి శ్రీకృష్ణ భగవానుడు స్వప్నమున కనపడి ఏదేని ఒక గ్రంథమును వ్రాసి నాకంకిత మిచ్చిన నీ జన్మ సార్ధకత పొందునని చెప్పి ఉంటాడు.

# సిద్ధేంద్రుని రమణీయ రూపకం కూచిపూడి భామాకలాపం

కూచిపూడి మాగాణముపై వెల్లి విరిసిన భామాకలాప మొక పారిజాతం. ఈ భామాకలాప సురభిళముల నా ఘ్రాణించని ఆంధ్రుడుండడనిన అతిశయోక్తి కాదు. ఆంధ్ర వాఙ్మయంలో కలాపమును తొలుత సృష్టించిన ఘనత ఈ యోగి పుంగవునికే దక్కింది. అంతేకాదు. యీ కలాప సృష్టి అటు కలాప వాఙ్మయానికి ఇటు యక్షగాన వాఙ్మయానికి నాంది పలికింది.

తనకు పూర్వమే స్వగ్రామంలో తిష్టవేసిన నాట్యకళ కాకర్షితుడై చదువు సంధ్యలు లేకపోయినను, వివాహితుడై అనంతరం విద్యాధికుడై, శాస్త్రవేత్తయై, కవియై, గాయకుడై, నాట్యాచార్యుడై, తన హృదయాంతరాళాలలో దాగివున్న కళారూపం, ఒక దృశ్య ప్రబంధరూపం దాల్చింది. అదియే భామాకలాపం.

భామాకలాపం ఇక వృత్తం చాలా అల్పం, స్వల్పం. సత్యభామ సర్వాభరణములు ధరించి వాసవ సజ్జికవాలకమున శయన మందిరమున ఉండగా, శ్రీకృష్ణుడామెను సమీపించి "భామా! నీవే అందగత్తెవా! లేక నేనే అందగాడనా?" అని ప్రశ్నిస్తాడు. లోకోత్తర సౌందర్యం ఏకత్రా రాశీభూతమై రూపుదాల్చిన సత్య "నేనే అందగత్తెనని" సమాధానమీయగా కృష్ణుడు అలుకతో పడకగది వీడుతాడు. ఈ సంఘటనతో సత్యభామకు శ్రీకృష్ణునితో ఎడబాటు ఆరంభమై విప్రలంభమై తాళలేక వెతికి వేసారి కడకు తన చెలియైన మాధవిని మాధవునొద్దకు లేఖ వ్రాసి ఆమె అడిగిన ఆభరణములను కడకు ముక్కు ముంగెర సయితం యిచ్చి, శ్రీకృష్ణుని రప్పించుకొని పునః కలహించి మాధవి మంచి మాటలతో స్వామికి బంగారు పూవుల పూజచేస్తుంది. ఇదీ కథాంశం.

శ్రీకృష్ణుడు శయనమందిరం వదిలి వెళ్ళిన దాదిగా సత్యభామ పొందిన విరహం ఇంత అంతకాదు. చంద్రదూషణ చేస్తుంది. మన్మధదూషణ చేస్తుంది. మాయదారి మందులమారి సవతులను నిందిస్తుంది. విరహోద్వేగానికి తాళలేక మూర్ఛపోతుంది. ఈ సందర్భంగా భామాకలాపమొక ''శృంగార రసపేశల సుధాకలశంగా వడగట్టిన అలంకార భరత శాస్త్రంగా'' కనపడుతుంది.

సిద్ధేంద్రుడు యోగికదా! అతడింతటి శృంగార రసమయ జగత్తును సృష్టించగలడా? అని, ఔననుకొనిన అది ఉచితమా? అని అయితే సిద్దేంద్రుడు యోగియైనను రసమయ జగత్తును సృష్టించుటకు కారణం లేకపోలేదు. అతని నిజజీవితమందు శృంగార

మనుభవించకపోయిననూ, అది అతని హృదయగతమై కరుడు గట్టి సుషుప్త్యావస్థ యందుండ దానిని అతని ప్రతిభ కరిగించి ప్రవహింపచేసింది.

మధుర భక్తికి నిలయమైన ఈ భామాకలాపంలోని విప్రలంభ శృంగారం పతాకస్థాయికి చేరింది. ఇందు యౌవనదశలో సన్యసించిన సిద్దేంద్రుడు సత్యభామ పాత్రద్వారా చూపించిన ఈ విప్రలంభం నిజమున కాయనదే.

భక్తిని, రక్తిని, సంగీత, సాహిత్యం నాట్యములతో మేళవించి, శ్రీకృష్ణుడు నృత్య...గానాలకు వశంవదుడని మరోసారి నిరూపించు పూనికలో సిద్ధహస్తుడైనాడు సిద్దేంద్రుడు.

ఇక సత్యభామ మాధవిని అన్వేషణకై మాధవిని నియమించగా, ఆమె ప్రతిఫలంగా ముక్కు ముంగెర నర్థిస్తుంది. అంత భామ ''హరి హరీ! ఎంత మాటంటివమ్మా? స్త్రీలకు సకలాభరణములలో ముంగెరే ముఖ్యమైనదిగాన, నీ కెటుల నిత్తునమ్మా...'' అని సత్య పలుకుతుంది. మాధవి పట్టుదలతో సత్య కడకు ముంగెరను మాధవికిస్తుంది.

ఇక్కడ మాధవిచే ముంగెర నర్థింప చేయటంలో అర్థం వేరు.

సత్యభామకు ఆభరణములపై మక్కువ ఎక్కువ. శ్రీకృష్ణుడు తిరిగి రావలెనన్న ఈ ఆభరణములు, ఆస్తిపాస్తులు ఇత్యాదులపై

మమకారం తొలగవలెననీ, అది తొలగినదో లేదో పరీక్షించుటకై ముక్కు ముంగెర నర్థింప జేసినాడు సిద్ధేంద్రుడు.

ఇతః పూర్వం అందం విషయంలో సత్యతో పందెంలో కూడా శ్రీకృష్ణునకు సత్యభామ తానే అందగత్తెనని సమాధానమీయగానే, సత్యకాయన దూరమైనాడు.

కొంతకాలం ఎడబాటు ననుభవించింది. అది అతి దుర్భర వేదనగామారి సహించలేకపోయింది. భర్తకొరకేమైనా చేయుటకు సిద్ధమై ముక్కు ముంగెరను మాధవికిచ్చి వేగంగా వెంట తీసుకురమ్మని పంపుతుంది. ఈ మనోహర రూపాన్ని దరువులు, పదాలు, అభినయప్రధానమైన సాహిత్యంతో కూచిపూడివారు రమణీయంగా ప్రదర్శిస్తారు.

వెనుకటి తరంవారిలో కీ.శే. వెంపటి వేంకటనారాయణశాస్త్రి, చింతా కృష్ణమూర్తి ఈ కలాపానికి విపుల ప్రాచుర్యం కల్పించారు. ప్రస్తుత తరంవారిలో శ్రీయుతులు పసుమర్తి కృష్ణమూర్తి, వెంపటి చినసత్యం, జోస్యుల సీతారామశాస్త్రి, వేదాంతం జగన్నాథశర్మ, వేదాంతం ప్రహ్లాదశర్మ మొ: వారు దీని బోధనలో ప్రవీణులుగా నున్నారు.

కుమారి శోభానాయుడు, వేదాంతం సత్యనారాయణశర్మ, మంజుభార్గవి, శ్రీమతి రత్నపాప, పద్మశ్యామల యామినీ కృష్ణమూర్తి, శ్రీమతి ఉమాసంపత్ మొ: వారు దీన్ని చక్కగా ప్రదర్శిస్తున్నారు.

# భామాకలాపంలో భరతశాస్త్రం

భామాకలాప సృష్టి ప్రతిష్ఠా మహిమాన్వితుడు శ్రీ సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రయోగి కూచిపూడి కులపతులలో అగ్రపీఠం అధిష్ఠించిన వ్యక్తి. అసలు కూచిపూడివారికి నాట్యకళను ప్రసాదించినదీ సిద్ధేంద్రయోగియని కొందరందురు. కాని సిద్ధేంద్రునకు పూర్వమే కూచిపూడిలో నాట్యసరస్వతి తిష్ఠవేసింది. కూచిపూడివారికి సిద్ధేంద్రయోగితో నాట్యం రాలేదు. కాని కలాపవిద్య అనగా "భామాకలాపం" వచ్చింది. శ్రీ సిద్ధేంద్రుని భామాకలాపం ఆంధ్ర యక్షగాన వాఙ్మయానికి మౌలిక, కూచిపూడి నాట్య సరస్వతికొక మణిమాలిక.

ఇక సిద్ధేంద్రుని ఉనికి గురించి, జీవిత చరిత్ర గురించి ఎందరో విద్యాధికులు ఎన్నెన్నో ఊహించారు. కాని ఇదమిత్థమని నిర్ణయించుట కాధారములు అలభ్యమగుట మన దురదృష్టం. అయితే సిద్ధేంద్రయోగి కూచిపూడి వాస్తవ్యుడని మాత్రం నొక్కి చెప్పవచ్చును.

ప్రకృత విషయం 'భామాకలాపం భరతశాస్త్రం' గురించినది. 'భామాకలాపం' కన్న భరతముని ప్రోక్తమైన భరతశాస్త్రం ప్రాచీనమైనదని అందరికీ తెలిసిన విషయమే. అయితే భామాకలాపంలో భరతశాస్త్రం ఎంతవరకూ ఉన్నదనే విషయం గురించి ముచ్చటించటం యీవ్యాసోద్దేశం. మహాకవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలానికి సంస్కృత రూపక లక్షణాలు చాలావరకు పట్టినట్లు, సిద్ధేంద్రయోగి భామాకలాపానికి చాలావరకు భరతశాస్త్రం పట్టింది. భరతుని నాట్యశాస్త్రమే భరతశాస్త్రం. నాట్యశాస్త్రంలో నృత్త, నృత్య, గీత వాద్యాదులతోపాటు ఛందోవ్యాకరణ అలంకారాది సాహిత్య విషయాలూ ప్రవచించాడు భరతుడు. భామాకలాపం ఆపాత మధురమైన సంగీతం, ఆలోచనామృతమైన సాహిత్యం, నయనానందకరమైన నాట్యముల కలయిక. అందుకే అది యొక త్రివేణీ సంగమం. అందువలననే "భామాకలాపం పడగట్టిన అలంకార

భరతశాస్త్రమని శ్రీ విశ్వనాధవారు తమ ఏకవీరలో వక్కాణించగా ఆచార్య శ్రీ యస్వీ జోగారావుగారు ''ఈ భామాకలాపము శృంగార రసపేశల సుధాకలశ''మని తమ ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్రలో సంభావించారు.

భామాకలాప ఇతివృత్తం చాలా స్వల్పం. ఒకనాడు శ్రీకృష్ణుడు సత్యభామని ''భామా! నీవే అందగత్తెవా? లేక నేనే అందగాడనా?'' అని ప్రశ్నింప, సహజ సౌందర్య గర్వితయైన సత్య పరమాత్ముని ప్రశ్నలోని పరమార్థమెరుగక నేనే అందగత్తెనని సమాధానమిస్తుంది. అంత శ్రీ కృష్ణుడు అలుకతో సత్యాసదనం వీడిపోతాడు.

ఇక సత్య కృష్ణు నన్వేషించుటకు తన చెలియైన మాధవి సాయం అర్థిస్తుంది. కడకు మాధవి కొక లేఖ యిచ్చి ఆమె అడిగిన ముక్కుముంగెర నిచ్చి పరమాత్ముని కడకు పంపుతుంది. సత్యాకృష్ణుల పునస్సంధాన కర్త యీ మాధవి. ఇదీ ఇతివృత్తం.

## భామాకలాపం... రసం... విప్రలంభ శృంగారం

''విభావానుభావ వ్యభిచారి సంయోగాద్ర నిష్పత్తిః'' అని భరతుని రస సిద్ధాంతం. ఈ విభావానుభావ వ్యభిచారి భావాలకు కాణాచి భామాకలాపం. ఇక ఈ కలాపంలో అంగిరసం శృంగారం. రస ప్రాణికోటికీ అనుభవైక వేద్యమైంది, రస రాజమైంది, సురచిరమైంది, శృంగారం. ఇది రెండు రకాలు. ఒకటి సంభోగ శృంగారం, రెండు విప్రలంభ శృంగారం. ప్రస్తుత భామాకలాపంలో విప్రలంభ శృంగారలహరి అనేక విధాల ప్రసవిస్తుంది.

భామాకలాపంలో భామకు శ్రీకృష్ణునితో ఎడబాటు సంభవించిన దాదిగా విప్రలంభ శృంగారం ఆరంభమౌతుంది. ఇక భామావిరహంలో శృంగార నాయికగ అనేక వాలకాలు వేస్తుంది. శ్రీకృష్ణుని అన్వేషిస్తుంది. ఈ విరహాన్ని అదునుక మదనుడు సత్యను

బాధించటం, భామ మన్మథబాధను సైపక మన్మథదూషణ, చంద్రదూషణ, కడకు నాయకుని వంశదూషణ గూడ చేస్తుంది. ఈ విరహోద్వేగంలో సత్యభామ అష్టవిధ శృంగార నాయికలలో స్వాధీనపతిక, విరహోత్కంఠిత, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారికల వాలకాలు వేసింది. దశావస్థల ననుభవించింది. సంచారీభావ పరంపరలకు లోనైంది.

పైన తెల్పినవానిలో భామాకలాపంలో భామ...

మదనా... మ... ద... నా యనుచు
మదనగోపాలా మరపదేలర సామీ?
మారుని శరములబారి కోర్వగలేక
|| మదన

అని ఆనందభైరవి రాగం ఆదితాళంలో మన్మథబాధ ననుభవిస్తుంది. ఈ మన్మథ శరఘాతానికి తాళలేక

''పఠాణీ రౌతు ఠీకునన్ మిఠారియైన
క్రొన్ననల్
కఠారిగా నమర్చి బల్ గటాయితంబుగా
జనుల్
తుటాల్తుటాలు సేయ బూనె ద్రోవబాసి
రాగనే
యిటో యెటో యెటోగదమ్మ, యేమి
సేతు, మారుడే...
మెరుంగువాడి తూపులన్ కురంగలోచ
నాళిపై
తురంగమెక్కి బంతులున్ మెరుంగు
చోకులన్ వెతల్
దొరంగ చేయుచున్ బళిం మరంగు
అందు అంతకంతకున్
భరంబుతోట వచ్చెనంత పాపజాతి
మారుడే!''

అని మన్మథ దూషణ చేస్తుంది. అంతేగాక,

రాచవారికి బుట్టి రమణుల నేచేవు
అందమా యిది నీకు చందమామ!
రాత్రించరా నిన్ను రాజనంగను సిగ్గు
సందులో దొంగ వో చందమామ!
పరవడి దినముల పాము నిన్నంటగా
సగమాయె నీ రూపు చందమామ!
గురుని యిల్లాలితో గూడినావను తొంటి
నింద నీకును జాలు చందమామ!
అమరసంఘంబు నీ కళ లారగించ
నెగ్గు సిగ్గును లేని నీకేమి చింత
కమలవైతివి నీ కళల్ గరగిపోను
చలము మామీద నేలనో చందమామ!

అని చంద్రుని, మన్మధుని అబల సత్య దూషిస్తే వా రూరకుందురా? వా రామెను మూర్ఛను బడద్రోసిరి.

## సత్యభామ వేసిన శృంగార నాయిక వాలకాలు

<u>స్వాధీన పతిక:</u>

నాయకునిచే నెల్లప్పుడూ సంతోషపరుప బడెడిది.
దర్వు... భైరవి రాగం... మిశ్రచాపు.
భామనే సత్యభామనే...
వయ్యారి ముద్దుల సత్య భామనే
భామనే పదియారువేల...
కోమలు లందరిలోన
రామరో గోపాల మూర్తికి...
ప్రేమదానైన సత్య
అట్టహాసము చేసి సురుల...
వట్టె గెలిచిన పారిజాతపు

చెట్టుదెచ్చి నాదు పెరటను...

గట్టిగ నాటించుకొన్న భామనే

వారిజాక్షి ద్వారకా...

నివాసుని కౌగిలిలోన

కూరిమి బెనగొని...

రతుల దేలిన యొయ్యారి సత్య భామనే

ఇందు సత్యభామ ద్వారకా నివాసుని విశిష్ట ప్రేమ పాత్రురాలై అతనిచే ఎల్లప్పుడు ఏదో ఒక విధముగా సంతోషపరుపబడుచున్నది. అంతేకాదు పారిజాతవనమున విహరిస్తోంది. అందుచే 'స్వాధీనపతిక' యైనది.

విరహోత్కంఠిత:

నిరపరాధియగు ప్రియుడు రాక జాగు చేయగా నా విలంబము నోర్వలేక నెదురు చూచు నాయిక. నిరపరాధి యయిన శ్రీ కృష్ణుడెంత కాలమునకు రాక జాగు చేయ

''నే తాళలేనే ఓ యమ్మలారా

తాళలేనే భామలారా

ఇందరిలోను యాసామ్మి లేలే

నా నాధుడేడే వేగింపలేనే''

అనుచు సత్య విరహోత్కంఠితయైనది.

ఖండిత:

సంకేత సమయము నతిక్రమించి అన్యోపభోగపు గురుతులతో ప్రాతఃకాలమందు వచ్చెడి నాయకుని గలది.

శ్రీకృష్ణుడు సత్యను సమీపింప ఆమె మాధవితో ''ఈతని ముఖము పాలిపోయినదేమే! కనులెఱ్ఱగా నున్నవేమే! అధర మటులున్నదేమే!''

అనుచు అన్యోపభోగపు గురుతులను కాంచి సఖి మాధవి నడుగుచు ఖండితయైనది.

కలహాంతరిత:

సఖుల ఎదుట చరణ పతితుడగు నాయకుని నిరాకరించి పిదప పరితాపపడునది.

దర్వు: 'భామనా సత్యభామనా'

కక్షగట్టిన లక్షణకు తాకట్టుగా నిను గూర్చి

కసితో

లేమలెల్లరు చూడ జడతో వేమరు నిను

కొట్టకున్న భామనా

అని తనను సమీపించిన శ్రీకృష్ణుని నిరాకరించి పరితాపము నొంది మాధవి సమక్షమున "బంగరు పూవుల నిన్ను పూజ సేయుదునా" అని కలహాంతరితయైనది సత్య.

ప్రోషితభర్తృక:

నాయకుడు దేశాంతరమున కేగియున్నప్పుడు ఖేదపడునది.

సత్యసదనము వీడినాడు శ్రీకృష్ణుడు. సత్యభామ శ్రీకృష్ణుడు ద్వారక కేగెనని ఖేదపడుచు ప్రోషితభర్తృకయై నిదుర కాచినది.

అభిసారిక:

మదనానుసంతప్తయై తన స్థలమునకు నాయకుని వచ్చునట్లు చేయునదిగాని, తనే నాయకుని స్థలమునకు బోవుచున్నదిగాని అభిసారిక.

దర్వు: ముఖారి... ఆది

"ఎందుబోతివి? ఎందుబోతివి? రారా నందనందనా!" అనుచు సత్య మదనసంతప్తయై నాయకుని వెదకుచు నాతని స్థలమునకు బోవుచు అభిసారిక యైనది. ఈ విధముగ సత్యభామ అనేక విప్రలంభ శృంగార నాయిక వాలకాలు వేసినది.

ఇక దశావస్థలైన చక్షుఃప్రీతి, చింత ఇత్యాది పది అవస్థలను పొందినది. అంతేకాదు సంచారీ భావములైన నిర్వేదము, గ్లాని, అసూయ, మదము, అపకృష్టము, మోహము, స్మృతి, చపలత, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, ఇత్యాదులను అనుభవించినది.

నిర్వేదము:

తత్త్వ జ్ఞానము, పేదరికము, సంకటము, వియోగము, దుఃఖము మొదలైన వానిచే కలుగు ఫలాభావమతి నిర్వేదము అనబడును. ఉ:... "నీవే అందగత్తెవా? లేక నేనే అందగాడనా?" అని కృష్ణుడు సత్యనడుగగా ఆడబుద్ధి అపరబుద్ధి గనుక నేనే అందగత్తెననగా, స్వామి అలిగి దిగ్గున లేచిపోవును. నాయకుని వియోగముచే నాయికకు నిర్వేదము ప్రాప్తించినది.

భామాకలాపం... సంగీతం:

ఇక భామాకలాపమున నాట, మోహన, ఆహిరి, సౌరాష్ట్ర, ఆరభి, ఆనందభైరవి, ముఖారి, ఖమాస్, శంకరాభరణము, మధ్యమావతి, తోడి, హిందోళ, కాంభోజి, భైరవి, పంతువరాళీ, హంసధ్వని, కేదారము, దేవగాంధారి ఇత్యాది సుప్రసిద్ధ, కర్ణాటక రాగములుపయుక్తములైనవి.

భామాకలాపము దృశ్యప్రబంధమగుటచే భావము ప్రౌఢమైనను ఉపయుక్తమైన భాష చక్కని సరళశైలి యందున్నది. కొన్ని తావులందు ప్రౌఢముగను గలదు. సత్యభామ మాధవిచే శ్రీకృష్ణునికి వ్రాసి పంపిన లేఖ యిట్లుండును...

"శ్రీ మద్రత్నాకరపుత్రిక ముఖారవింద మరందపాన వినిశిత మిళిందాయమాన నందనందన ముచికుంద వరద మందరోద్ధర పరిహసిత రాకాసుధాకర సుందర వదనార విందులగు శ్రీ రాజగోపాలస్వామివారి చరణారవిందంబులకు సత్యభామ నిటలతట ఘటిత కరకమలయై అనేక సాష్టాంగ దండప్రణామంబు లాచరించి చేయంగల విన్నపములు. "మజ్జనకుండగు సత్రాజిత్తు నన్ను మీకిచ్చి వివాహం బొనరించిన ప్రభృతి వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక,



నాట్య కళానిధి

శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు

పుష్యరాగ స్థగిత పద్మరాగ, మరకత సకల వికల్పిత నానావిధ చిత్ర విచిత్ర, జాంబూనద రత్న నిర్మితంబగు హంసతూలికాతల్పంబున దివ్యమంగళ విగ్రహాకారులై గాఢాలింగనం బొనర్చి..." ఈ విధముగ ప్రౌఢలి ప్రౌఢముగ సాగింది. ప్రౌఢమైన సత్య లేఖ గదా!

ఇట్లు భామాకలాపంలో భరతశాస్త్రం ఎక్కడ చూస్తే అక్కడ దర్శనమిస్తుంది: కాబట్టే అది వడగట్టిన అలంకార భరత శాస్త్రంగా కనిపిస్తుంది. రసరాజమగు శృంగార సురుచిరత్వంలో అలంకారశాస్త్ర మర్యాదలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దు ప్రూనికలో సిద్ధేంద్రయోగి సిద్ధసంకల్పుడైనట్లు భామాకలాపం బుజువు చేస్తుంది.

సిద్ధేంద్రయోగి తన భామకే శుభ ముహూర్తాన రూపు సంతరింపచేసి, కాలికి గజ్జె కట్టెనోగాని ఆ చరణకింకిణులు నాటినుండి నేటివరకు సద్యోహృద్యమై సహృదయ నైవేద్యమై పండిత పామర జనరంజకమై అటు కోటలోని వారిని, ఇటు పేటలోని వారిని చైతన్య చకచ్చకితుల నొనర్చుచూ సామాజిక హృదయారవిందాలకు విందొనగూర్చుచునేయున్నవి.

# కూచిపూడి నాట్యం... ప్రక్రియా ప్రభేదాలు

విజయనగరము సంగీత సాహిత్యములకు, అమరావతి అపురూప శిల్పసంపదకు ప్రసిద్ధమైనట్లుగనే, కూచిపూడి నాట్యకళకు సుప్రసిద్ధమైనది. ఈ వ్యాసమందు కూచిపూడి నాట్య ప్రక్రియా ప్రభేదములను గూర్చి ముచ్చటింతును.

సర్వసామాన్యముగా కూచిపూడి భాగవతుల నృత్య ప్రదర్శనములు శబ్దారంభమై, పదాభినయ ద్వితీయమై, అష్టపదులతో ఆనందమయమై తరంగములతో సహృదయోత్తుంగ తరంగములకు పంతలై, జావళీలతో జాలువారుచు, త్యాగయ్య, రామదాసు, మువ్వపల్లె యిత్యాది వాగ్గేయకారుల కీర్తనములతో శ్రీరామచంద్రుని మొ:లగు దేవతలను కీర్తించుచు, జతిస్వర జతికట్టుల స్వర పల్లవులతో నృత్తమును పలుకరించుచు, వర్ణులను వర్ణించుచు తిల్లానాలను తీర్చిదిద్దుచు, కలాపములను కలియద్రిప్పుచు, దినకర కిరణ సంశోభితము విజ్ఞానానంద దాయకములైన పగటి వేషము (బహురూపము)లను పటిష్టము చేయుచు, ''కీర్తింతురెద్దాని కీర్తిగంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణిన్'' అనునట్లుగా యక్షగాన వైదుష్యమును చాటుచు, ''నాట్యం భిన్న రుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్'' అను కవికుల తిలక కాళిదాసోక్తికి అన్వర్థముగా భిన్న విభిన్న ప్రక్రియలతో కూడిన కూచిపూడి భాగవతుల నాట్య ప్రక్రియ ప్రభేదములు ఆంగిక, ఆహార్య, వాచిక, స్వాత్త్వికాభినయ సంయుతములై, విభానుభావ, సంచారిసంయోగాద్రవ నిష్పత్తులతో కూడి రసలీలలగుచున్నవి.

ఇక ప్రథమతః వారి శబ్దాభినయమును గురించి ముచ్చటింతును:

## శబ్దము

మాత్రాఛందస్సులో, అంత్యప్రాసలలో, చతురశ్రగమనములో, గనుక ప్రాధాన్యమైన నృత్యాభినయములకు లక్ష్యమై ఆద్యంతముల జతులు, కొనగోలులను కలిగి యడనెడ గతుల మార్పిడిని గలిగి, పల్లవి అనుపల్లవి, చరణముల విభజన విరహితములై భావప్రస్ఫుటమునకై ఒకే పాదము పునరావృతమగునది శబ్దము. ఇది గతి ప్రస్తారము, నర్తకులకు విదితమగుట కుపకరించును. ఈ లక్షణములు గలిగిన సుమారొక ఇరువదియైదు శబ్దములను కూచిపూడి వారభినయింతురు.

ఈ శబ్దములను పరిశీలింప రెండు విధముల వింగడింపవచ్చును. అందు ఒకటి దేవతా సంబంధములు, రెండు రాజ సంబంధములు. ఈ శబ్దములందు ఏదేని ఒక దైవమునుగాని, రాజునుగాని నుతించి కడకు నన్నేలుకొమ్మనియో, పరాక్ అనియో, సలాం అనియో ముగింతురు. వీటిలో కొన్నింటిని సలావ్ జతులు అనుట కద్దు.

## రాజసంబంధీయములైన శబ్దములు:

కూచిపూడి భాగవతులు రాజాస్థానములకేగి ఆ రాజులను నీవు ఇంద్రుడవు, చంద్రుడవు, మన్మధుడవు, శిబివి, కర్ణుడవు అని వారిని స్తుతించి తమ కళాకౌశలమును ప్రదర్శించి వారి ఆదరమునకు పాత్రమగుట. దైవ సంబంధీయములలో దశావతార శబ్దము, కృష్ణ శబ్దము, రామాయణ శబ్దము, గజేంద్రమోక్షశబ్దము ప్రసిద్ధములు.

## పదాభినయము

మొవ్వ... క్షేత్రయ్య పదములతో కూచిపూడి నృత్యమునకు పుష్టి తుష్టి వచ్చినది. పదాభినయమున కూచిపూడి వారిది అందె వేసిన చెయ్యి.

## పదము

సంగీత సాహిత్య నృత్య సమ్మేళనము అనగా త్రివేణి సంగమమువంటిది. పదము సాత్త్వికాభినయ ప్రధానము. అలతి పదముల అనల్పార్థ రచనను పల్లవి, అనుపల్లవి, చరణముల విభజనము, శృంగార భక్తిరస ప్రధానమును, విలంబకాలమున నడకను కలిగి యుండునది పదము.

ఉ.1. మగువ తన కేళికా మందిరము వెడలే

2. మక్కువ తీర్పర మువ్వగోపాలా ఇత్యాది యాబది, అరువది పదములను లాస్య పద్ధతిని భావానుభావ విభావములతో నాయికా లక్షణములకు లక్ష్యములుగ నభినయించి రసోత్పత్తిని గలుగచేయుటలో కూచిపూడి వారు సిద్ధహస్తులు.

## అష్టపదులు

పద్మావతీ చరణచరణ చక్రవర్తియైన జయదేవుని గీత గోవిందములోని అష్టపదులను శృంగార, భక్తి ప్రపూరితములగ కూచిపూడి భాగవతులు అభినయింతురు.

అష్టపది అనగా ఎనిమిది పాదములను నృత్య నృత్తముల రెండింటికి లక్ష్యమును కలిగిననునృత్యమునకే యధిక ప్రాధాన్యత కలిగి యుండునది. అష్టపది గానమునే ధ్రువాగానమనుట కద్దు.

ఉ.1. రతి సుఖసారే గతిమభిసారే మదన మనోహరవేశం

2. ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలి

జయదేవుని సంగీత సాసిత్యములతో కూచిపూడివారి అభినయవిద్య మేళవింపబడి సహృదయ హృదయార విందంబులకు విందొనగూర్చు చున్నదనుట నిస్సందేహం.

# తరంగములు

యతినారాయణ తీర్థ విరచిత కృష్ణలీలా తరంగిణిలోని తరంగములను వ్యస్తముగ సమస్తముగ కూచిపూడివారు ప్రదర్శించుట సిద్దు.

తరంగము అనగా... నృత్త ప్రాధాన్యమై, నృత్య ద్వితీయమై శృంగార భక్తి ప్రపూరితములై మధ్యమకాలము నడకగలిగినవై ఆపాత మధురమైన సంగీతము ఆలోచనామృతమైన సాహిత్యము అను రెండు జీవనదులు సంగమించి సముద్ర తరంగ రూపమును సంతరించుకొనినరచనను తరంగమందురు. వీనిలో మోహనరాగములోని బాలగోపాల తరంగముచే సమ్మోహితులుకాని సామాజికు డుండడనిన నతిశయోక్తి గాదు. ఇందు ''ఇందిర మందిర భక్త సుందర హృదయారవింద'' అనుచోట ప్రతిపదార్థాభినయము తొలుత చేసి నాట్యయోగము నభినయింతురు.

ఈ నాట్యయోగమున శిరస్సున పూర్ణకుంభమును పాదముల క్రింద పళ్ళెమునుంచి పూర్ణకుంభమునుండి ఉదకము చిందక పళ్లెము నుండి పాదములు చెదరక సంగీత తాళలయలలోని హొయలు చూపుచూ గతులు తప్పక నర్తించుచు నాట్య యోగమభినయింతురు. ఈ యోగ విద్యను గ్రహించలేని సామాన్యులు సర్కసుగా భావించి చౌకబారు నాట్యమందురు. కాని నాట్య శాస్త్రమున...

శ్లో. పుంఖానుపుంఖ విషయేక్షణ తత్పరోపి
బ్రహ్మావలోకనధియం
నజహాతి యోగి
సంగీత తాళలయ వాద్యవశంగతాపి
మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీర్నటీవ,

అని చెప్పబడినది. ఇందు నర్తకునకు విషయ వాంఛా విదూరుడగు యోగి పుంగవునితో సామ్యము చెప్పబడినది. యోగి పుంగవుడు అనేక విషయములలో పరివ్యాప్తుడై యున్నను, అతని మానసము బ్రహ్మ

పదార్థ అవలోకన తత్పరతతో ప్రకాశించుచుండు రీతిగనే నర్తకుడు సంగీత తాళలయాది వాద్య విశేషానుగుణ నర్తనా కౌశల లగ్నమానసుడై యుండియు తన్మౌళిస్థ పూర్ణకుంభ సంరక్షణ తత్పరుడై యుండుటచే యోగీంద్రుని స్థిత ప్రజ్ఞా సదృశప్రాభవుడగుచుండును. ఈ యోగమందలి పూర్ణకుంభము సంపూర్ణత్వమును, శుభమును సూచించును.

ఈయోగము నర్తకుని మనోనిశ్చలతకు పరాకాష్ఠ. అంతేకాదు అతని కళాకౌశలమునకు నికషోపలము. ఈ యోగము విజయవంతముగా సామాజికుల కరతాళధ్వనులు మిన్నుముట్టును. ఈయోగవిద్యను కూచిపూడి నాట్యమందు నిక్షిప్తమొనర్చినది శ్రీ చింతా వెంకట్రామయ్య దీనిని వీరు తమ ప్రియశిష్యుడు ''భరత కళా ప్రపూర్ణ'' శ్రీ వేదాంతం రాఘవయ్యగారితో ఆరంభించిరి.

## జావళీలు

భావాశ్రయమైన నృత్య ప్రధానములై శృంగారరస సుధాకలశములై విలంబమధ్యమ నడక గలిగినవై కైశికీవృత్తికి లక్ష్య భూతములైన రచనలు జావళీలు అనబడును.

దశాధికములైన జావళీలను కూచిపూడి వారు అభినయింతురు. వానిలో దాసు శ్రీరాములగారి ''తత్తరపడనేల తాళుతాళురసామి అత్తింటి కోడల'' కైశికి వృత్తిలో ద్రాక్షపాకము జాలువారునట్లు వ్రాసిన శ్రీరాములుగా రత్యంత అభినందనలు. ఇది అటు తోట్ల వల్లూరు శ్రీ వేణుగోపాలస్వామికంకితమగుటయే కాక ఇటు కూచిపూడి భాగవతుల కభినయమున కంకితమగుట చిత్రవిచిత్రము. ఈ జావళీని కూచిపూడి యక్షగాన పితామహులు శ్రీ చింతా వేంకటరామయ్యగారు శ్రీ వసుమర్తి కృష్ణమూర్తిగారికి నేర్పి ప్రదర్శించి ఘనతగాంచిరి.

## కీర్తన

గాన ప్రదానమైన, నృత్య ద్వితీయమై విలంబనడకన గుణమతిని గలిగియుండునది కీర్తన. ''గేయే పాఠేచమధురమ్'' అనునది త్యాగయ్య, రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యముల రచనలయందు సుధాక్షర సత్యమైన విషయము. అధ్యాత్మ రామాయణ కీర్తనములలోని ''నమశ్శివాయతే నమోభవాయ'' అను ధన్యాసి రాగకీర్తన మధురాతి మధురము.

## జతిస్వరము

జతి, స్వరముల సమ్మేళనము జతి స్వరము పల్లవి, చిట్టస్వరములు గలిగి పల్లవిలో సాహిత్యమునకు బదులు జతులను కలిగి బింబ ప్రతిబింబములవలె జతిస్వరములలో నొక దానినొకటి అనుసరించుచు నృత్తం తాళలయాశ్రితం అనుభరతోక్తికి లక్ష్యభూతమైనది జతిస్వరము. కూచిపూడి వారి వ్యస్త నృత్యాంశముల ప్రదర్శనములో జతిస్వరము సర్వసామాన్యము. అందు అఠాణరాగములోని తారిఝంతక అను జతిస్వరము ఉదహరింపదగినది. ఇందు అంగిక అభినయము అధికత్యతో సామాజికులను అలరించును. జతిస్వరముల తర్వాత పేర్కొనదగినవి జతి కట్టులు. వీనినే అర్ధీలందురు.

## జతికట్టు

జతులు పల్లవియందు రాగ సహితములై వీణ గమకమును, ఛందోగమనమును కలిగి మృదంగ నిస్వనములచే లయల హొయలను స్పష్టము చేయునది జతికట్టు. ఇందు స్వరమునకు అవకాశముండదు. అఠాణరాగములోని 'తాంధణ తాం' అను జతికట్టు పేర్కొనదగినది.

## కౌత్తము

కూచిపూడి భాగవతులు నృత్యాంశములలో కౌత్తమొక విశేషణ ప్రక్రియ. ఇవి చూపరులకు ముచ్చట గొలుపుచుండును. మాత్రాఛందస్సును కలిగి జతులు సాహిత్యముల సమ్మేళనమై ముక్కలుముక్కలుగ విరామములను కలిగి రాగవిరహితములై యుండునది కౌత్తము. "కిత్తావ్రతే కౌత్త ముచ్యతే" వీనిలో 72 అక్షరములను కలిగిన వినాయకతాళకౌత్తలు 'డికుందరి, టెకుందరి, ఉమయాత్రయముఖ' అను కౌత్తము ముచ్చటింపదగినది.

## తిల్లానా

కూచిపూడి నృత్య సంప్రదాయంలో తిల్లానాలు సుమనోజ్ఞమైనవి. మృదంగాక్షరములను సంగీతంతో అనగా రాగముతో సమ్మేళనమొనర్చి కడకు సాహిత్యమును కలిగియుండు రచనను, తిల్లానాయందురు. ఇది ద్రుతకాలమున వుండును. ఇందట నట నట స్వరములుండుటయు కద్దు. సామాన్యముగా పల్లవి అనుపల్లవులకు జతులుండును.

ఇవి కూచిపూడివారి యక్షగానమునను తావు చేసికొనినవి. శ్రీ వేదాల తిరునారాయణాచార్యులవారి 'ప్రహ్లాద' యక్షగానము లోని శంకరాభరణం రాగతిల్లాన "దాందానేతిత్తిల్లానా దిరిదిరిదాం" ప్రసంగింపదగినది.

## స్వరపల్లవులు

స్వర ప్రధానముగా పల్లవి, స్వరాక్షరముతో సాహిత్యమును పల్లవి విభాగమును కలిగియుండును. కూచిపూడి వారి నృత్య ప్రదర్శనములలో స్వల్పస్థానమే స్వరపల్లవులది. ఇందు స్వరములకు నృత్తము నేర్పరచి వానిద్వారా తమ నృత్త పాండిత్య ప్రకర్ష ప్రదర్శింతురు. ఈ స్వర పల్లవులకు వసంతోదయము, వసంత రాగస్వర పల్లవి, సానీదని సనీదమా దానిసా.

## శ్లోకాభినయము

ప్రతి పదార్థము అభినయపూర్వకంగా ప్రదర్శింబడు దానిని శ్లోకార్థాభినయమందురు. కూచిపూడివారి శ్లోకాభినయము విశిష్టమైనది. వీరు అభినయ దర్పణము నాట్యశాస్త్రము, కృష్ణలీలా తరంగిణి, శ్రీ కృష్ణ కర్ణామృతము, శ్రీరామ కర్ణామృతము, పుష్పబాణ విలాసములలో శ్లోకములను సామాన్యముగా అభినయంచేయుదురు.

ఇంతవరకు తెలిపిన వ్యష్ఠ నృత్యాంశములను 'నాట్యకళా నిధులు' శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు బహుళ ప్రచారం గావించిరి.

ఇక కూచిపూడి భాగవతుల కళాఖేలలు వ్యష్ఠ నృత్యాంశములతో ఆరంభమై దేశీయ కలాప యక్షగానములతో పరిపక్వత చెందినవి. అంతేగాక పగటి వేషములను చేపట్టుట జరిగినది. వీరి ప్రకమలములందు ఏ ప్రక్రియయైనను భరత కళాసంశోభితమై యొప్పారు చుండును.

## కలాపములు

సిద్ధేంద్రయోగితో కూచిపూడి భాగవతుల నోములు పండినవి. శుభోదయము జరిగినది. యేతత్ ఫలితమే భామాకలాప ప్రాదుర్భావము. ఈ భామాకలాపము భరతవిద్యా దురంధరుల సామర్థ్యమునకు కళా పరిజ్ఞానమునకు గీటురాయి అయినది. ఏతత్ ప్రయోగ పరీక్షయందు కూచిపూడి భాగవతులు పరపమ పట్టభద్రులైరి. అంతేగాదు. వీరు భామా కలాపమునకు ఏ తత్కర్తకు

ఎనలేని ఖ్యాతి నార్జించు చుండిరి. విశ్వనాథవారు వక్కాణించినట్లు "వడగట్టిన అలంకార భరతశాస్త్రమైన భామాకలాపము నాట్య శాస్త్ర నిష్ణాతులైన భాగవతులకు పుష్టిని, తుష్టిని నొసంగు చున్నది. "నా నృషిః కురుతే కావ్యమ్" అనినట్లు సిద్ధేంద్రుడు యోగిపుంగవులైన తరువాత రచించిన భామాకలాపము కూచిపూడి కళాక్షేత్రమున నొక పారిజాతమై గుభాళించుచున్నది. అంతేగాక కూచిపూడి వారి మెదడుకు మేతయైనది. వీరు నిజముగా సిద్ధేంద్రయోగికి ఎంతగానో ఋణపడి యున్నారు. ఏ శుభముహూర్తమున సిద్ధేంద్రుడు తన భామకు గజ్జెలు కట్టెనో గాని అవి నాటినుండి నేటివరకు ఘల్లుఘల్లుమనుచు సద్యోహృద్యమై, సహృదయనై వేద్యమై అలరించపజేయుచున్నవి.

ఈ భామాకలాపమునకు కొంత కాలమునకొక సోదరి జన్మించినది. అదియే గొల్ల కలాపము. దీనిని శ్రీ భాగవతుల రామయ్యగారను హఠయోగీంద్రులు రచించిరి. ఈ గొల్లభామ సత్యభామ, ఇరువురు కూచిమూడివారి చేతులలో రూపురేఖలు సంతరించుకొనిరి. కాగా గొల్లకలాపము పండితులకు పరమానందదాయమై, షట్ఛాస్త్రములకు నిలకడయైనది. ఈ కలాపవిద్యయందు "లయబ్రహ్మ" శ్రీ వెంపటి వెంకట నారాయణ శాస్త్రిగారు సిద్ధహస్తులు.

## యక్షగానములు

శ్రీహరి మాధవయ్య... శ్రీ చింతావెంకటరామయ్యగారు ప్రహ్లాద, ఉషాపరిణయము, రామనాటకములు, శశిరేఖా పరిణయము, సత్యహరిశ్చంద్రీయము, రుక్మిణీ పరిణయము ఇత్యాదిదేశీయమైన యక్షగానములను గైకొని వానిపై శాస్త్రీయ ముద్రవేసి అనగా భరతుని భరత విద్యతో పరిష్కరించి ప్రయోగింపజొచ్చిరి. బంగారము అగ్నియందు దోషరాహిత్యమును చెంది ప్రకాశించునట్లుగనే

యక్షగానములు వీరి కరకమలములందు శాస్త్రీయత నొంది విరాజిల్లినవి. వీరి తర్వాత యక్షగానములను "భరత కళాప్రపూర్ణ" శ్రీ చింతా కృష్ణమూర్తిగారు, వారి శిష్యులు పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారు, శ్రీ బందా కనకలింగేశ్వరరావుగార్లు ప్రచారం చేసిరి.

## నృత్యనాటికలు

నృత్యనాటిక ప్రక్రియ ప్రపంచమునకు పరమేష్ఠి డా.వెంపటి చినసత్యంగారు. వీరు క్షీరసాగర మథనము, శ్రీ కృష్ణపారిజాతము, శాకుంతలము, చండాలిక, మేనకావిశ్వామిత్ర, విప్రనారాయణ, కుమార సంభవం, శ్రీనివాసకల్యాణం, కల్యాణరుక్మిణి , హర విలాసం ఇత్యాదులకు రూపురేఖలు దిద్ది ప్రచారం చేయుచుండిరి. వ్యష్ఠ నృత్యాంశములతో సంజనితమైన రసస్రవంతులు శ్రీ చినసత్యంగారి నృత్యనాటికలతో నుత్తుంగ తరంగముల రూపములదాల్చి అటు కోటలోనివారికి, ఇటు పేటలోని వారికి కూచిపూడి భాగవతుల ప్రక్రియా ప్రభేదాలు రసలీలలై సర్వసామాజికులకు బ్రహ్మానంద సహోదరమైన ఆనందము నందించుచున్నవి.

# కూచిపూడి నాట్యం మూర్తిత్రయం

ఆంధ్రుల జాతీయ నృత్యం కూచిపూడి నృత్యం. ఇది తరతరాలుగ వారసత్వంగ వస్తున్న ఆంధ్రుల కళాసంపద. ఈ సంపదను అభివృద్ధి చేయుటకు శ్రీ సిద్ధేంద్రయోగివలె ఎందరో మహానుభావులా కూచిపూడి కళామతల్లికి తమ జీవితాలను నైవేద్యమొనర్చారు. శ్రీ సిద్ధేంద్రయోగి 'భామాకలాప' కర్త ప్రయోక్త ఉపరి అగ్రశేణి కులపతి. ఈతని 'భామాకలాపం' కూచిపూడికొక మహోదయం. అంతేకాదు శ్రీ సిద్ధేంద్రుని "భామాకలాపం" ఆంధ్ర యక్షగాన వాఙ్మయానికి మౌలిక. కూచిపూడి నాట్య సరస్వతికొక మణిమాలిక.

సిద్ధేంద్రుని తరువాత కూచిపూడి నృత్యాన్ని బహుళ ప్రచారం చేసిన ఘనత "కూచిపూడి యక్షగాన పితామహులు" శ్రీ చింతా వెంకట రామయ్యగారు నాట్యకళానిధులు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు. "లయబ్రహ్మ" "కలియుగ సత్యభామ" శ్రీ వెంపటి వెంకట నారాయణ శాస్త్రిగార్లకు దక్కినది. ఈ ముగ్గురు మూడు మార్గముల ద్వారా కూచిపూడి నృత్యాన్ని ప్రచారం చేసి ఆ కళకు అజరామరత్వాన్ని కల్గించారు. శ్రీ చింతా వెంకట రామయ్యగారు యక్షగానములకు రూపకల్పన చేసి నాట్యధర్మిని, లోకధర్మిని ప్రయోగించి ప్రచారం చేసి కూచిపూడి యక్షగాన పితామహులైనారు. శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు వ్యష్ఠ నృత్యాంశములను పుష్పచయముతో కూచిపూడి నృత్యసరస్వతికి అర్చన చేశారు. ఈ నృత్యాంశములను నాట్యశాస్త్ర అభినయ దర్పణములకు లక్ష్యములుగ జేసి ఒక ఉన్నతమైన ప్రామాణికతను సంతరింపజేశారు. కూచిపూడి నృత్యం కేవలం పురుషులకే పరిమితం కారాదని భావించి స్త్రీలకు నేర్పి వారిచే వైయక్తిక నృత్య ప్రదర్శనలతో ప్రచారం చేశారు. శ్రీ వెంపటి వెంకట నారాయణ శాస్త్రిగారు సిద్ధేంద్రయోగి భామాకలాపాన్ని బహు వారాలుగ ప్రదర్శించి ప్రచారం చేసి ప్రసిద్ధిగాంచారు. కావుననే నేటి కూచిపూడి కళాకారులందరూ



కూచిపూడి యక్షగాన పితామహులు
శ్రీ చింతా వెంకటరామయ్యగారు

ముగ్గురిని కూచిపూడి నృత్యానికి ''మూర్తిత్రయంగ'' భావించి ంజలి ఘటిస్తారు.

## 'కూచిపూడి యక్షగాన పితామహులు''

## శ్రీ

## చింతా వెంకట రామయ్యగారు

శ్రీ చింతా వెంకటరామయ్యగారు 1860వ సంవత్సరమున కూచిపూడిలో అరుంధతి, శివరామయ్య అను దంపతులకు జన్మించారు. వీరికి జ్యేష్ఠ సోదరులైన శ్రీ వెంకటరత్నంగారు ప్రథమ గురువులు. తరువాత వీరు శ్రీ యేలేశ్వరపు నారాయణప్పగారిని శుశ్రూషించారు.

శ్రీ వెంకటరామయ్యగారు నవనవోన్మేషణమైన ప్రతిభాశాలి అగుటచే నూతన ప్రయోగ ప్రక్రియ కొఱకన్వేషించి యక్షగానమును గైకొన్నారు. వీరు లుత శ్రీ వేదాల తిరునారాయణాచార్యులు, రామానుజాచార్యుల ప్రహ్లాద చరిత్రమును గ్రహించి సుప్రసిద్ధ శాస్త్రీ సంగీత సంప్రదాయ సరణిలో బాణీలు సమకూర్చారు. ప్రహ్లాద ప్రదర్శనకు తగిన పాత్రధారులనెన్నుకొని తగిన శిక్షణనిచ్చి సుమాం క వేయి ప్రదర్శనలిచ్చారు. వీరు ప్రహ్లాద ఆంధ్రావనికి ఆనందప్రదాయియయినది. శ్రీ వెంకటరామయ్యగారీ ప్రహ్లాద ప్రదర్శనమున సూత్రధారులుగా సుప్రసిద్ధులైనారు. వీరు తరువాత రెండు చింతల చిదంబరకవి విరచిత ఉ పరిణయమును కూర్చి ప్రయోగించి ఖ్యాతి గాంచారు. ఇందు శ్రవణానందకరమైన బాణీలను చక్కని నృత్యమును సమకూర్చారు. తరువాత వల్లభనేని రామకృష్ణకవి కృతమగు శశిరే పరిణయము గయనాటకములకు రూపురేఖలు దిద్ది ప్రదర్శించారు. పిమ్మట అనంతదాసాఖ్య ప్రణీతంబయిన రామనాటకమును లవకుశ చరితమును రమణీయముగ ప్రయోగించారు. తదనంతరం ఏనుగులూరి పాపరాజు కవి విరచిత

మోహినీ రుక్మాంగదను ధర్మాంగద చరితమును సమ్మోహనాస్త్రంగ ప్రయోగించారు. ఈ విధంగ శ్రీ చింతా వెంకటరామయ్యగారు కూచిపూడి యక్షగాన పితామహులై, ప్రయోక్తలై, ప్రాచార్యులైనారు.

శ్రీ వెంకటరామయ్యగారు తనదగునొక విశిష్ట సత్సంప్రదాయమును సృష్టించుకొన్నారు. చతుర్విధాభినయములలో అతి క్లిష్టమైన సాత్వికాభినయమును తన సొంతసొత్తుజేసికొని భావపురుషులుగ భాసించారు.

శ్రీ వెంకటరామయ్యగారు ఉత్తమమైన ఉపదేశికులు వీరి శిష్యులలో శ్రీ హరి చలపతి, శ్రీ వేదాంతం చలపతి, శ్రీ వేదాంతం జనారనయ్య, శ్రీ వేదాంతం రామయ్య, శ్రీ వేదాంతం రామకృష్ణయ్య, శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ చింతా రామమూర్తి, శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెదసత్యం, శ్రీ పసుమర్తి, శ్రీ వేణుగోపాల కృష్ణశర్మ ప్రభృతులెందరో, అందరు లబ్ధప్రతిష్ఠులే. నేటి కూచిపూడి కళాకారులందరు వెంకటరామయ్యగారికి ప్రత్యక్షముగనో పరోక్షముగనో శిష్య ప్రశిష్యులే.

శ్రీ వెంకటరామయ్యగారు 18 వ సంవత్సరమున శ్రీ వెంకట రామ నాట్యమండలిని స్థాపించి తన పరిశోధనా ఫలితముగ నూతన ప్రయోగము అయిన యక్షగానాలతో సామాజికులను ఆనందసాగర ఉత్తుంగ తరంగములలో ఓలలాడించారు. వీరు స్థాపించిన నాట్యమండలి నూరు వసంతములు దాటి ఆంధ్రదేశమున జైత్రయాత్ర సాగిస్తోంది.

శ్రీ వెంకటరామయ్యగారు దేశీయమైన యక్షగానమును గైకొని దానికి భరత పరిష్కారమొనర్చి ఆంధ్రదేశంలో యక్షగానం సజీవమై అలరారుటకు తన జీవితాన్ని అంకితం చేశారు. శ్రీ వెంకటరామయ్యగారు తన నాట్యమండలికి తన పుత్రులు శ్రీ రామమూర్తి, శ్రీ కృష్ణమూర్తిగార్లను వారసులు చేశారు. శ్రీ

కృష్ణమూర్తిగారు తమ ప్రియతమ శిష్యుడైన "పద్మశ్రీ" వేదాంతం సత్యనారాయణశర్మగారిని వారసులుగ నియమించారు. నేటికీ నాట్యమండలి వయసు నూరు సంవత్సరాలు దాటింది. ఆంధ్రదేశంలో మరే యితర నాట్యమండలి యిన్ని సంవత్సరములు జీవించి యుండలేదేమో

ఈ విధంగ శ్రీ వెంకటరామయ్యగారు సమాజ నిర్మాతలై, యక్షగాన పితామహులై, యక్షగాన ప్రయోక్తలై సంగీత నృత్యదర్శకులై, ఆచార్యులై, ప్రచారకులై, నటులై, గాయకులై, బహుముఖీన ప్రజ్ఞాపాటవాలతో పండిత పామరజన రంజకులై

"కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి "

అనునట్లు యక్షగాన ప్రదర్శనార్థం 1949 న స్వర్గమునకేతెంచిన అమరజీవి ధన్యజీవి శ్రీ చింతా వెంకటరామయ్యగారు. శ్రీ వెంకటరామయ్యగారు కూచిపూడి కళాకారులకు గురువై ఆరాధ్య దైవమై కూచిపూడి నృత్యమూర్తిత్రయమున ప్రథమస్థానమలంకరించారు.

## "నాట్యకళానిధి" శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు

శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు 1886 వ సంవత్సరమందు కూచిపూడి కళాక్షేత్రమున సావిత్రమ్మ శ్రీ రామేశంగార్లకి పుత్రలుగ ఉదయించారు. శ్రీ శాస్త్రిగారు బాల్యమున భరతకళతోపాటు సంస్కృతాంధ్రముల నధ్యయనము చేసి 'శాస్త్రి' అన్వర్థనామ యులయ్యారు.

శ్రీ శాస్త్రిగారు భామ, గొల్ల వేషములను, సమర్థవంతముగ ప్రదర్శించెడివారు. వీరు తాము నేర్చిన వ్యస్థ వృత్యాంశములను నాట్య శాస్త్ర, అభినయ దర్పణాది లక్షణ గ్రంథములతో సమన్వయపరిచి ప్రదర్శించెడివారు. శ్రీ శాస్త్రిగారికి శాస్త్రీయ దృక్పథము దొడ్డది,

శ్రీ శాస్త్రిగారు జయదేవుని అష్టపదులు క్షేత్రయ్య, సారంగపాణి పదములు, జావ లు రామాయణశబము, యిత్యాదులను వ్యస్తముగ ప్రదర్శించుట యందొక ప్రత్యేక బాటనేర్పరచారు. శ్రీ శాస్త్రిగారు ఈ వ్యస్థ నృత్యాంశములందు ఒక చరణమును పునరావృత్తం చేయుచు సంచారీ భావములలో రసోచితంగా, సందర శుద్ధిగా ప్రదర్శించెడివారు. నేడు కూచిపూడివారు వ్యస్తముగ ప్రదర్శించు నృత్యాంశములు, వీరి బాణిననుసరించియే యుండును. వ్యస్త నృత్యాంశము శ్లోకాభినయం శ్రీ శాస్త్రిగారి సొత్తు. వీరు బహుళ ప్రచారములోనికి వీటిని తెచ్చినారు.

సామాజికుల కవగతమగుటకు ఒక్కొక్క శ్లోకపాదము ననేక సంయుత, అసంయుత హస్తములతో చూపినవానిని మరల చూపక, అద్భుతముగ అభినయించెడివారు. వీరు కృష్ణకర్ణామృతము; రామకర్ణామృతం, పుష్పబాణవిలాసం, నాట్యశాస్త్రం అభినయదర్పణములోని శ్లోకాలను అభినయించి అందలి అర్థములను, అభినయమును శిష్యులకు బోధించెడివారు. శ్రీ శాస్త్రిగారు అభినయ విద్యయందందెవేసిన చేయి.

శ్రీ శాస్త్రిగారి బోధనమార్గము శిష్యుని మనస్తత్వము ననుసరించియుండెడిది. కూచిపూడి నాట్యకళ కపార ప్రచారము చేసిన ఘనత శ్రీ శాస్త్రిగారికి దక్కినది.

భావనగరు మహారాజ శ్రీ పి.వి. రాజమన్నారు శ్రీ శాస్త్రిగారి శాస్త్ర వైదుష్యము, కళాప్రావీణ్యమును గాంచి సువర్ణ సింహతలాటములతో అలంకరించిరి.

శ్రీ శాస్త్రిగారి శిష్యకోటి అగణితమనిన అతిశయోక్తికాదేమో, వీరి శిష్యులలో ప్రముఖులు, 'భరత కళాప్రపూర' శ్రీ వేదాంతం జగన్నాథ శర్మ, శ్రీ వెంపటి పెదసత్యం, కళాప్రపూర్ణ నా. శ్రీ వెంపటి చినసత్యం, 'భరత కళాప్రపూర్ణ' శ్రీ నటరాజ రామకృష్ణ, శ్రీ అయ్యంకి తాం వకృష, 'భరత కళాప్రపూర్ణ' శ్రీ కోరా నరసింహారావు యిత్యాదులు ఎందరో అందరూ ఉత్తమ నాట్యాచార్యులే.

శ్రీ శాస్త్రిగారి అభినయ నైపుణ్యమునుగాంచి శ్రీ ఉదయశంకర్, భరతనాట్య ప్రవీణులు శ్రీ రామయ్యపిళ్ళై, శ్రీమతి బాలసరస్వతిగార్లు శిష్యులయిరి. భారతదేశమంతటను శ్రీ శాస్త్రిగారికి శిష్య ప్రశిష్యులనేకులు కలరు. శ్రీ శాస్త్రిగారు పొందని పురస్కారము లేదు.

శ్రీ శాస్త్రిగారు 1956 వ సంవత్సరము జూలై 1 వ తారీఖున స్వర్గలోకమున రంభ, ఊర్వశి, మేనకలకు నాట్యము నేర్పుటనాకనునట్లు నాకలోకవాసులయిరి.

''లయబ్రహ్మ'' శ్రీ వెంపటి వేంకట నారాయణ శాస్త్రిగారు

శ్రీ వెంపటి వెంకట నారాయణశాస్త్రిగారు 1871వ సంవత్సరమున కూచిపూడి మాగాణముపై పున్నమ్మ, కోదండ రామయ్య అను పుణ్యదంపతుల నోముల పంటగా ప్రభవించారు. వీరు తన తండ్రియొద్దనే వంశానుగతంగ వచ్చుచున్న భరత విద్య నభ్యసించారు. శ్రీ వేంకట నారాయణశాస్త్రి చక్కని చిక్కని రూపం. స్త్రీ వేషధారణకనువైన దారూప సంపద.

శ్రీ వేంకటనారాయణ శాస్త్రిగారు సిద్ధేంద్ర కృత భామాకలాప ప్రదర్శనమున సత్యభామ పాత్రధారిగా ఆంధ్రప్రదేశమున ందు ఆబాల గోపాలమునకు ఆనందము నందించిన మహానటుడు నాట్యాచార్యుడు. శ్రీ వెంకట నారాయణగారు సత్యభామ పాత్రపోషణమున అందెవేసిన చేయి. వీరు విప్రలంభ శృంగారాభినయమును సహజసిద్ధంగ ప్రదర్శించెడివారు. సత్యభామ పాత్రధారిగా శ్రీ వెంకటనారాయణగారు దశావస్థలు; సంచారీ భావములు చక్కని హావభావములతో ప్రదర్శించెడివారు. అంతేకాక స్వాధీన పతిక; విరహోత్కంఠిత; ఖండిత, కలహాంతరిత; ప్రోషిత భర్తృక అభిసారిక వాలకములను కడు సమర్ధవంతముగ పోషించి సత్యభామ పాత్రలో ఎనలేని ఖ్యాతిని గడించి ''కలియుగ'' సత్యభామ బిరుదాంచితులయ్యారు.

శ్రీ వెంకటనారాయణగారు సత్యభామ విరహమును ప్రదర్శించుచు 'మదన' దరువును అనేక గతుల ప్రస్తరింపజేసి తన

నృత్త నృత్య కళాకౌశలమును ప్రదర్శించెడివారు లయజ్ఞానమున అఖండులగుటచే స్వోపజ్ఞతో ఆశు కవితా ధోరణిగ 'కొనగోలు' జతికట్టు యిత్యాది లయసంబంధమైన విద్యను ప్రదర్శించి 'లయబ్రహ్మ' బిరుదాంకితులయ్యారు.

సత్యభామ అభిసారిక నాయికయై శ్రీకృష్ణుని 'ఎందుబోతివి' అని ముఖారి రాగమున అన్వేషించును. ఇందు శ్రీ వెంకటనారాయణగారు కరుణ రసమును ప్రదర్శించి సామాజికులచే కంట తడి పెట్టించెడివారు. వీరు శృంగార కరుణ రసములను సమానముగ సమర్ధవంతముగ పోషించెడివారు.

శ్రీ వెంకటనారాయణగారు చక్కని గాయకులు. "శ్రీ మద్రత్నాకర పుత్రికా ముఖారవింద మరంద పాన వినిశిత మిళిందాయమాన..." అని ఆరభిరాగమున లేఖ వ్రాయుచు చదువుచుండగ లౌకిక ప్రపంచమును మరువని సామాజికుడుండడనిన నతిశయోక్తి కాదేమో!

శ్రీ వెంకటనారాయణగారు శ్రీ కృష్ణునితో సత్యభామ సంవాదన మొనర్చు సందర్భమున

"కక్షగట్టిన లక్ష్మణకు తాకట్టుగ నినుగూర్చి కసితో
లేమలెల్లరు జూడ జడతో వేమరునినుగొట్టకుంటే భామనా
సత్యాభామనా"

అనుచు సత్యభామ క్రోధము కసి, సహజసౌందర్యము గంభీరత, గర్వము ఇత్యాది భావములన్నింటిని తగు స్థాయిలో ప్రదర్శించి అటు పండితులచే ఇటు పామరులచే సెహబాస్ అనిపించుకొనిన సాటిలేని మేటి సత్యభామ పాత్రధారి శ్రీ వెంకటనారాయణగారు వీరి భామాకలాపమును వేయిమార్లు ప్రదర్శించి 'అభినవ సత్యభామగా' అభినుతింపబడ్డారు. శ్రీవెంకటనారాయణగారు సత్యభామ పాత్రపోషణమున తరువాతి తరమువారికి మార్గదర్శకులయ్యారు. వీరీ సత్యభామ వేషమును తన అరువదవ సంవత్సరమువరకు ప్రదర్శించారు.

శ్రీ వెంకట నారాయణగారు భామ వేషమునే గాక దాదినమ్మ వేషకథయందు లీలావతి పాత్రను నద్భుతముగ పోషించెడివారు. ఈ దాదినమ్మ వేషకథ ప్రయోగము ప్రక్రియ చిత్ర విచిత్రముగ నుండెడిది. అంతేకాదు వీరు బాలింత వేషమును ప్రదర్శించుట యందును ప్రసిద్ధిగాంచారు.

శ్రీ వెంకట నారాయణగారిని భామ పాత్రధారునిగా జూచిన హరికథా పితామహులు శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారు ఒక ప్రదర్శనమున సూత్రధారులుగ భామకలాప ప్రయోగమును చేసిరి ఆనాటి ప్రదర్శనము వర్ణనాతీతం. పుంభావ సంగీత నాట్య సరస్వతీ స్వరూపులిరువురి కలయిక గదా!

శ్రీ వెంకటనారాయణగారు చక్కని దేశికులు. వీరు కలాపవిద్యను పదిమందికి పంచి యిచ్చిన ఆచార్యులు. వీరి శిక్షణ క్రమశిక్షణతో గూడి యుండెడిది. వీరి శిష్యులలో శ్రీ చింతా రామమూర్తి శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి, శ్రీ భాగవతుల నరసింహం, శ్రీ పసుమర్తి విశ్వనాథం ప్రభృతులు, ప్రముఖులు శ్రీ వెంకటనారాయణగారు గొప్ప మంత్ర శాస్త్రవేత్తలు. వీరు జీవితమును కలాప విద్యకు నైవేద్యమొనర్చి తమ అరువది నాలుగవ యేట 1935లో పరమపదించిన పరమ భాగవతోత్తముడు శ్రీ వెంకటనారాయణగారు కూచిపూడి నృత్య త్రయమున తృతీయ పీఠం నలంకరించారు.

# కూచిపూడి నట్టువోజు శ్రీ చింతా కృష్ణమూర్తి

కూచిపూడి యక్షగాన సూత్రధారులు; యక్షగాన ప్రయోక్తలు; అభినవ భరతాచార్యులు; ఏకసంథాగ్రాహులు; అభ్యాసములేకయే అనూచానముగా కైవసమైన నాట్యకళాకౌశలము గల ధీశాలురు; గంధర్వాంశసంభూతులు; త్యాగశీలి; నిరాండంబరులు; సహృదయులు; భరతశాస్త్రవేత్తలు; నవరస పటుతర నటనానైపుణ్య గణనీయులు; ఉత్తమ కులపతులు, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ సన్మానితులు, రాష్ట్రపతి మెచ్చిన యక్షగాన సూత్రధారులు; 'భరత కళాప్రపూర్ణులు' శ్రీ చింతా కృష్ణమూర్తిగారు.

వీరు 1912వ సంవత్సరమున కూచిపూడి గడ్డపై 'ఆంధ్ర యక్షగాన పితామహులు' ఆచార్య శ్రీ చింతా వేంకటరామయ్య అన్నపూర్ణమ్మలకు ముచ్చటైన మూడవ కుమారులుగ జన్మించిరి. వీరు 'శైశవేభ్యస్తవిద్యానామ్' అన్నట్లుగనే తమ శైశవదశలో శ్రీ కణుపూరి చలమయ్యవద్ద లౌకికవిద్య నభ్యసించిరి. ఆ సమయమునందే స్వగృహమున తమ పితృపాదులయొద్ద నృత్యకళాభ్యాస మారంభించిరి. వీరికి నిలకడ తక్కువగుటచే అనునిత్యమూ విద్యనభ్యసించెడివారు కారు. కాని శ్రీ చింతా వేంకటరామయ్యగారి యిల్లు ఒక గురుకులమగుటచే ప్రతి నిత్యము ఎందరో విద్యార్థులు ఈ నాట్యవిద్య నభ్యసించుచుండెడివారు. కృష్ణమూర్తిగారు ప్రతినిత్యము తాను నేర్వక నేర్చుకొనెడివారిని మాత్రము పరిశీలనగా చూచుచు నాట్యవిద్యను కరతలామలకము చేసికొనిరి. ఏకసంథాగ్రాహులు, సూక్ష్మగ్రహణ శక్తిసంపన్నులు అగుటచే ఎంత క్లిష్టవిషయమైనను ఒక్కసారి చూచినంతగనే, వినినంతగనే తమదిగా జేసికొనెడివారు. అట్టి శక్తియుక్తులు భగవంతుడు వీరి కొసగెను. అప్పటికేకమ్మెచ్చు తీసిన కంఠస్వరముతో రామదాసు కీర్తనలు, ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలు, గజేంద్రమోక్షము, తూము నరసింహదాసు కీర్తనలు, ఇత్యాదులను నవరసభరితముగా గానము చేయుచుండెడివారు. వీరు



కూచిపూడి నట్టువోజు "భరత కళాప్రపూర్ణ"
శ్రీ చింతా కృష్ణమూర్తి

న్నవయసునందే సంగీత సాహిత్యములకు సమ ప్రాధాన్యమిచ్చి
ాడుచుండుటచే వీరి గానము సర్వులకు సదా శ్రవణానందదాయకముగ
ుండెడిది.

కృష్ణమూర్తిగారికి లౌకికవిద్యాభ్యాసము పూర్తియైనది. వీరికి
ాస్త్రీయ సంగీతమనిన అభిమానము, అభిరుచి మెండు. ఆనాడు వీరి
ాహచరులంతా శ్రీ చల్లపల్లి సీతారామయ్యగారివద్ద కర్ణాటక సంగీతము
ాభ్యసించుచుండ వీరికి కూడ వారియొద్ద ఆ విద్య నేర్వవలెననెడి
ుంకల్పము కలిగినది. తమ కోరికను తండ్రిగారికి తెలియబరచిరి.
ారు నిరాకరించిరి. కారణము ఆర్థికమే. కాని కృష్ణమూర్తిగారంతటితో
ిరాశ నిస్పృహలను జెందక బ్రహ్మశ్రీ యేలేశ్వరపు
ీతారామాంజనేయులు గారి యొద్ద క్షుణ్ణముగ సంగీత మభ్యసించి
ాగినంత సంగీతజ్ఞానమును సముపార్జించిరి. చింతా
ెంకటరామయ్యగారి నాయకత్వములో 'చింతావారి మేళము'
ీలాపాదులను యక్షగానములను విరివిగా ప్రదర్శించుచుండిరి.
ృష్ణమూర్తిగారికి సుమారు పదునెనిమిది వసంతములు నిండినవి.
ుందైన విగ్రహము ఏర్పడినది. వీరి తండ్రిగారు వీరికా మేళమునందు
ాయకభూమికలను ధరించు బాధ్యతను ఇచ్చిరి. అప్పటివరకీ
ేళములో ఈ బాధ్యతను శ్రీ బొక్కా సీతారామయ్యగారు
ిర్వహించుచుండెడివారు. కృష్ణమూర్తిగారు తమ పదునెనిమిదవ
ేటనే రాముడు, కృష్ణుడు, హరిశ్చంద్రుడు, అనిరుద్ధుడు,
ుక్మాంగదుడు, దేవేంద్రుడు మున్నగు ధీరోదాత్త పాత్రలను
ివరసభరితముగ నటించుట ఆరంభించిరి. వీరిది సన్నవిడి గాత్ర

ాగుటచే ఎన్నో సంగతులు అలవోకగా పలుకుచుండెడివి. ఈ
ిధముగా సుమారు రెండు దశాబ్దములు గడిచినవి.
ెంకటరామయ్యగారికి వయసు పైబడినది. తనకు వారసులు సమర్థులు
ెండవ పుత్రులు అయిన శ్రీ చింతా రామమూర్తిగారికి మేళము
ాయకత్వపు బాధ్యతనిచ్చి తాను అక్కడక్కడా ప్రదర్శనలకేగి అందరి
ప్పొప్పులను వివరించుచు చక్కని రీతులు బోధించుచుండెడివారు.
·1-1949న 'ఆంధ్ర యక్షగాన పితామహులు' శ్రీ చింతా

వెంకటరామయ్యగారు పరమపదించిరి. దీనితో 'చింతావారి మేళము' నాయకత్వపు బరువు బాధ్యతలు ఈ రామ, కృష్ణులపై బడినవి. శ్రీ చింతా రామమూర్తిగారు యక్షగాన సూత్రధారులు. కృష్ణమూర్తిగారు నాయకభూమికలు, సహకారగానము. ఇంతలో వేంకటరామయ్యగారి వర్ధంతి వచ్చినది. రామ, కృష్ణులీ వర్ధంతికి కూచిపూడిలోని పసుమర్తివారి మేళమును, మహంకాళి వారి మేళమును, వేదాంతమువారి మేళమును మూడింటిని చింతా వారి మేళములో విలీన మొనర్చి ఆ నర్తంతులు చాక్షుషక్రతువులుగ చక్కని ప్రదర్శనలతో ముగించిరి. 1950లో శ్రీరామమూర్తిగారు స్వర్గస్థులైరి. ఇది కృష్ణమూర్తిగారికి అశనిఘాతమై తీరని లోటైనది. 1952 వరకు వీరు నిరాశ నిస్పృహలతో కాలము గడుపుచుండ నాటి మేళములో స్త్రీపాత్రధారియైన శ్రీ పసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కృషితో కృష్ణమూర్తిగారి నాయకత్వము క్రింద చింతావారి మేళము పునఃప్రదర్శనార్థము బయలువెడలినది. ఇది కృష్ణమూర్తిగారు కూచిపూడి యక్షగానసూత్రధారులగుటకు పూర్వరంగము.

తెనాలిలో ప్రదర్శనకై చింతావారి మేళము ఆహ్వానింపబడినది. ఆనాడే హరికథా పితామహులు ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథ. కథానంతరము కూచిపూడివారి 'ప్రహ్లాదచరిత్ర' యక్షగానము. కృష్ణమూర్తిగారు శిరమునకు జరీపాగా జుట్టి, ఫాలభాగమున వక్షస్థలమున బాహువులకు ఉదరమునకు విభూతిరేఖలు తీర్చి ఫాలభాగ మధ్యస్థంబుగ నొక గుండ్రని బొట్టు పెట్టి, కొసదేలిన కుండలములు కర్ణముల ధరించి, గళసీమన రుద్రాక్షమాలికలు వైచుకొని ముంజేతులకు బహుకృత సువర్ణ సింహతలాటము తగిలించుకొని, వామభాగంబున 'కటిలిక'యను దండమును వేసికొని, పసుపుపచ్చని పట్టుజరీ అంచు ధోవతిని కట్టి, కటి కొక జరీ ఉత్తరీయము జుట్టి బిగించి కంచుతో పోతపోసిన తాళపు చిప్పలను హస్తములందు ధరించి పారిపార్శ్వక విదూషకులతో రంగస్థలమును ప్రవేశించి నమస్కరించి యథోచితముగ పూర్వరంగ విధులను నిర్వహించి 'ఆది నాట అంత్య సురట' అను ఆర్యోక్తికి ధీటుగ 'అగజానన పద్మార్కం'అని నాటలో

విఘ్నేశ్వర ప్రార్థన చేసి గురుస్తుతి చేసి తదనంతరంబు సంప్రదాయమై వచ్చుచున్న అంబస్తుతి చేయుచు, త్రిశ, ఖండ, మిశ్ర సంకీర్ణగతులు నందందు పలుకరించుచు మేళవింపు ముగించి 'ఈ ప్రకారంబుగా ఇష్టదేవతా ప్రార్థనానంతరంబున జగదభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాచే ప్రదర్శింపబూనిన' ప్రహ్లాద చరిత్రంబను యక్షగానంబునకు కథాక్రమం బెట్టెదనినా అని 'మును ధర్మజుడు సేయు ఘన రాజసూయాధ్వరములోన' అను సీసమును అర్థవంతముగ చదివి, పిమ్మట ద్విపదలతో పూర్వకథావృత్తాంతంబు వివరించి చోప్‌దారుని ప్రవేశపెట్టి త్రిరాత్ర ప్రదర్శన కుద్దిష్టమైన ప్రహ్లాద చరిత్రను ఐదారు గంటలకు కూర్చు కూర్చుకొని ప్రదర్శింప దాసుగారు అవధులులేని ఆనందమును పొంది 'ప్రహ్లాద నాటకము నీ సొత్తు. దీనికి సూత్రధారుడవుగ నీవే తగుదువు. సూత్రధారుని నామ మన్వర్థమొనర్చితివి. నేటి నుండి నీవే సూత్రధారణ బాధ్యతను చేపట్టవలెనని నాటి కార్యకర్తలచే కంచున పోతపోసిన తాళములను, ఒక కాశ్మీరు శాలువను దెప్పించి సన్మానించి ఆశీర్వదించిరట. నాటినుండి ఇక కృష్ణమూర్తిగారి తాళమున కెదురులేదు.

వీరు తమదిగా ఒక ప్రత్యేక బాణీని యేర్పరచుకొనిరి. సూత్రధారునిగ భావతరముల వారికి మార్గదర్శకులైరి. వీరు మేళవింపు నందు పల్లవి పాడి తదనుగుణముగ స్వరప్రస్తారమునకు బదులు స్వరస్థానములాలో శబ్దప్రస్తారము చేయుచు సమయస్ఫూర్తితో అటనట 'తల్లు తట్టుచు' యక్షగానమునకు కావలసిన హంగును సమమేళవింపు నందే సమకూర్చి సామాజికులను యక్షగానాభిముఖులు కావించెడివారు.

వీరు భామాకలాపమును పునరుజ్జీవింప జేసిరి. వీరి సంప్రదాయ సంగీత నిర్వహణలో విజయవాడ ఆకాశవాణివారు భామాకలాపమును రికార్డు జేసిరి. అందు కుమారి శ్రీరంగం గోపాలరత్నం సత్యభామ పాత్రను, డా. పద్మశ్రీ శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు కృష్ణపాత్రను, వింజమూరి లక్ష్మిగారు మాధవి పాత్రను, చేపట్టి వానికి న్యాయము చేకూర్చుటయేగాక సిద్ధేంద్రయోగిని పునః రెండు

శతాబ్దములకాలము మరువకుండ చేసిరి. అంతేకాదు. శ్రీ కృష్ణమూర్తిగారి సంప్రదాయ సంగీత నిర్వహణలో ఉషాపరిణయము, శశిరేఖా పరిణయము, రామ నాటకము, గొల్లకలాపము, ఇత్యాదులను కీ.శే. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు పరిష్కరించగా సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ ఓలేటి వెంకటేశ్వర్లుగారు స్వరపరచ రికార్డు గావించి సంప్రదాయమునకు సుస్థిరత్వము నొసంగిరి.

కృష్ణమూర్తిగారు భామాకలాపమునందు మాధవిగ మధురాతిమధురముగ సమయస్ఫూర్తితో నటించెడివారు. వీరు సూత్రధారణ చేయుచు సత్యభామతో సహకారగానమే కాక విరహాది సమయములలో ఆమె కష్టమునందు తను పాలు పంచుకొనినట్లుగ సాభినయముగ ప్రదర్శించుచుండెడివారు. మాధవియొద్ద ముక్కుముంగెర తీసికొనుట సత్యభామ గర్వమణచుట కను భావము వ్యక్తమగునటులు నటించి ఆమెనుండి కమ్మ గైకొని కృష్ణుని కడ కేగ ఆ పరమాత్మని దర్శించుటతోడనే భూపాలరాగమున 'దండమయా విశ్వంభర! దండమయా పుండరీక దళనేత్రహరీ!' అనుచు సమయస్ఫూర్తితో కృష్ణశతకములోని కందమును అందముగ ఆనందముగ చదివి ' నా జన్మ ఈడేరే నా వ్రతము సఫలమాయే' అని తొలుత తన జన్మ సార్ధకత నొందినదని ఆనందించెడివారు. వారితో సామాజికులును ఆనందసాగరోత్తుంగ తరంగములలో మునిగి తేలుచుండెడివారు. సత్య కన్న మున్ముందుగ ఈ మాధవియే పరమాత్మను చేరి జన్మ చరితార్థతను పొందినదను భావము ప్రేక్షకులకు కల్గించెడివారు.

వీరికి గాత్రసౌలభ్యము మెండు. ఇటు స్త్రీ పాత్రలకు లాలిత్యముగ, అటు పురుష, రాక్షస పాత్రలకు పటిష్ఠముగ పాడుచుండెడివారు. 'ఉషాపరిణయము'న 'వెడలె అసురజలధిసోముడు వేడ్కతో రథంబు నెక్కి...' అనుచు ధీరోద్ధతుడైన బాణాసురునకు అప్పటివరకు సావేరిలో పాడి ఉష పార్వతీదేవిని పూజించు సమయ మాసన్నమవగనే భవానీ: భవానీ: భక్తపోషణీ: ముక్తిదాయనీ...... అనుచు దుర్గరాగమున సన్నగా మధురాతిమధురముగా భక్తిభావముతో గానముచేసేడివారు.

ఉష అనుంగుని బాణఘాతకములకోర్వలేక, అనంగుడు ఘనంబటంచు ఆగ్రహించెనే చెలీ అను పల్లవి వీరు త్రిశ, మిశ్ర, ఖండ, సంకీర్ణ గతులలో మూడుకాలములందు అలవోకగా అభినవ భరతునివోలె తమ పాండితీ పటిమను ప్రదర్శింప యేతత్తాళాను కూలముగ పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారు నృత్యనృత్తములను చేయ రెండుకనులు చాలెడివికావు. పాడుచు 'ఎవరు నావెతల గందు ఎవరీనీ వేడుకొందు...' పంతువరాలి రాగమున పాడుచుండ కన్నీరు మున్నీరుగాని, హృదయము ఆర్ద్రముగాని సామాజికుడుండెడివాడు కాడు. అసలు ప్రహ్లాద పాత్రధారి ఎవరను ప్రసక్తియే యుండెడిది కాదు.

స్వతః పరమ భాగవతోత్తములు శ్రీ కృష్ణమూర్తిగారు. అందువలననే కాబోలు 'ప్రహ్లాద నాటకం బనిన అత్యంత మమకారము.' 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అను ఆర్యోక్తికి దీటుగ యక్షగానములందలి ఆనందము ననుభవించి తరించి తమ జీవితమును వాని కంకితముజేసి ఇతరులకా ఆనందము నందించి తరింపజేసెడివారు.

వీరు సంస్కృతాంధ్రములలో భారత, భాగవత, రామాయణాది ఇదిహాసములను చదివిచూచిరి. అంతేకాదు. వీరు నిత్య విద్యార్థులు. సాహిత్యపరముగ సంగతపరముగ సంశయములు కలిగిన వరుసగ 'మహామహోపాధ్యాయ' బ్రహ్మ .వే. శ్రీ భాగవతుల రామలింగశాస్త్రిగారిని, బ్ర. వే. శ్రీ మహంకాళి లక్ష్మీనరసింహశాస్త్రిగారిని అడిగి తెలుసుకొనెడివారు. తమకు తెలియని విషయమును ఎంత చిన్నవారినుండియైన తెలుసుకొనుటకు వెనుకాడెడివారు కాదు.

కూచిపూడి యక్షగానములందు నటులందరు ఒకటి సూత్రధారుడొక్కడు ఒకటి. నటులకు ఏదో కొంత సంగీతజ్ఞానము భావప్రకటనశక్తి కొంత నాట్యము కలిగియున్న చాలు. కాని సూత్రధారుడటుల కాదు. శతాధిక రాగములను కలిగి ఎంతో సంగీతవైవిధ్యము గల ఈ యక్షగానములలో సర్వసమగ్రమైన సంపూర్ణ

సంగీత పరిజ్ఞానమును కలిగి యుండవలయును. యక్షగానమున పాత్రధారుడు పల్లవిని పలుకరింప అటనుండి చివరివరకు సూత్రధారుడే పాడవలయును. అవి మదింపుగ అర్థస్ఫూర్తిగ ఉండవలయును. ప్రతి పాత్రను రంగమండపమును ప్రవేశపెట్టి వానిని పలుకరించవలసినది సూత్రధారుడే. ఈ సంజ్ఞలోనే ఈతని ప్రాధాన్యము గోచరించుచుండును. ఈ సూత్రధారికి యక్షగానములన్నియు కంఠస్థములై ('టెక్స్టువల్'గ) పుక్కిటబట్టిన పురాణములుగ నుండును. అనగా సూత్రధారి శారదోపాసకుడై యుండవలయును. అటు సంగీతము ఇటు సాహిత్యములం దందెవేసిన చేయియై యుండవలయును. అంతేకాదు. సామాజికులను వశపరుచుకొనుటకు, ఆనందింపచేయుటకు సమయస్ఫూర్తిని కల్గియుండవలయును. ఎంతో సంగీతవైవిధ్యము గల్గిన యక్షగానములలో సూత్రధారికి ఎంత సంగీతపరిజ్ఞాన మవసరమో ఈ క్రింది విషయమును పరిశీలించిన అవగతమగును. ఉదాహరణకు ఒక దర్వును తీసికొనిన దానిని ఆ రాగము మారకుండ పాడుచు అవసరమైనచో ధృతకాలమునుండి విలంబమునకు, విలంబమునుండి ధృతమునకు, విలంబమునుండి మధ్యమమునకు మార్చుచు రససామాగ్రిని సజ్జీకృతము చేసికొని సామాజికులను రసఝరులతో ఊయలలూగించునది సూత్రధారియే. అది కృష్ణమూర్తిగారికి నల్లేరుపై బండి నడకం వంటిది. వీరు భావగ్రహణావిష్కరణ ప్రవీణులగుటచే భావమును, సంగీతాధికులగుటచే సంగీతమును, నాట్యాచార్యులగుటచే తాళమును సమ్మేళన మొనరించి భావరాగ తాలలయా సమన్వితులై 'భరత కళాప్రపూర్ణు'లైనారు.

వీరు ఉత్తమ ఉపదేశకులు. వీరి ఆచార్యకత్వము క్రింద వెలువడిన శిష్యప్రసూనము లనేకములు. అందు తొలుత పేర్కొనదగినవారు పద్మశ్రీ శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారు, శ్రీ పసుమర్తి శ్రీ వేణుగోపాలకృష్ణశర్మగారు, శ్రీ భాగవతుల సత్యసుందరరామశాస్త్రిగారు, కుమారి యామినీకృష్ణమూర్తి, కుమారి లంకా అన్నపూర్ణ, శ్రీమతి సుమతీ కౌశల్, శ్రీ వేదాంతం

రత్తయ్యశర్మ, శ్రీ పసుమర్తి రత్తయశర్మ, ఉత్తమ నాట్యాచార్య శ్రీ పసుమర్తి సీతారామయ్య, శ్రీ పసుమర్తి కేశవప్రసాద్, ఇత్యాలనేకులు. వీరిది శిష్యుని మనస్తత్వమెరిగిన శిక్షణగ యుండెడిది.

వీరుత్తమ నటులు. ఇట్టి వీరిని ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు 'భరతకళాప్రపూర్ణ' బిరుదునిచ్చి గౌరవించిరి. కేంద్రప్రభుత్వమువారు కేంద్ర సంగీతనాటక అకాడమీ ఫెలోషిప్ నిచ్చి సన్మానించినది. వీరు పొందని సన్మానములు లేవు. సువర్ణఘంటాకంకణ బహూకృతులు.

వీరి ప్రదర్శనను హైదరాబాదు రవీంద్రభారతి యందు, మచిలీపట్టణము ఆంధ్ర జాతీయ కళాశాలయందు తిలకించిన మన మాజీ రాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ 'కూచిపూడి యక్షగానములకు కృష్ణమూర్తిగారు జీవమ'నిరి.

ఇట్టి ప్రముఖుల ప్రశంసలనొందిన కృష్ణమూర్తిగారు కూచిపూడి నాట్యము అశాస్త్రీయమైనదనిన వారిచే కాదు శాస్త్రీయమైనదేనని ఒప్పించి ఆ నాట్యసంప్రదాయ సుస్థిరతకు కూచిపూడి యందు శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, పద్మశ్రీ సత్యనారాయణ శర్మగార్ల సహకారముతో, వెంకటరామ నాట్యమండలి సభ్యుల సహృదయతతో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రమును స్థాపించి, దేవేంద్ర భవనములవంటి రెండు భవనములను నిర్మించి తామే ప్రాచార్యులుగ పనిచేసి ఎంతోమంది ఉత్తమ కళాకారులను రూపొందించి ది. 31...8...1969న రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమల నాట్యప్రయోగముల ప్రయోక్తయై వాటిని చాక్షుష క్రతువులు చేసి అమరుల నానందింపచేయుటకై దివికేగిన అమరజీవి ధన్యజీవి. ఇట్టి సూత్రధారులు, ఉత్తమ ఉపదేశికులు కూచిపూడి కళాక్షేత్రమున మరి కానరారనిన నతిశయోక్తి, నత్యుక్తి కాదేమో!

# కూచిపూడి నాట్యకళోద్ధారకులు శ్రీ బందా

ఆంధ్ర నాటక కళారంగ చరిత్రమున కూచిపూడి నాట్య చరిత్రమున సువర్ణాక్షరములతో లిఖింప దగిన అక్షరములు "బందా". శ్రీ బందా కనకలింగేశ్వరరావు విద్యాధికుడు. మహానటుడు, కళోపాసకుడు, కళాపోషకుడు, నాటక సమాజస్థాపకుడు, నాటక ప్రయోక్త కళావేత్త, నాట్యకళోద్ధారకుడు, మహావక్త ఉపరి కృతి భర్త, కృతికర్త.

సుందరమ్మ... శ్రీశైలం దంతులకు వీరు 1907వ సంవత్సరము జనవరి 20వ తారీఖున కృష్ణామండలం కైకలూరు తాలూకాలోని ఆటపాక గ్రామంలో జన్మించారు.

1929లో బందరు నోబుల్ కళాశాల నుండి బి.ఎ. పట్టమును, 1932లో మద్రాసు న్యాయ కళాశాల నుండి బి.యల్. పట్టమును పొందారు.

"బందా" అనగానే ఆంధ్రుల స్మృతి ప్రధాన శ్రీ కృష్ణుడుగనో, శ్రీనివాసుడగనో, సారంగధరుడుగనో, కాళిదాసుగనో కదలాడుతాడు. అంతేకాని న్యాయవాదిగకాదు. శ్రీ బందాకి కళాశాల విద్యాభ్యాసం రోజులే వారి నాటక రంగ జీవితానికి నాంది పలికినవి. కళాశాలలో బి.ఏ. చదివే సమయంలో నాటికి నేటికి ప్రజలలో ప్రతిధ్వనించే తిరుపతి వేంకట కవుల పాండవోద్యోగ విజయాల పద్యాలపై ఆ నాటకములపై, శ్రీ బందా దృష్టి మరలింది.

ఆ సంవత్సరం నోబుల్ కళాశాల సాంస్కృతికోత్సవములో పాండవోద్యోగ విజయము నాటకము ప్రదర్శించారు. అందు శ్రీకృష్ణుడు శ్రీ బందా, బందరు బుట్టాయిపేట హాలు శ్రీ బందాకి తొలి రంగస్థలం. స్వతః చాణక్యునిలాంటి తెలివి తేటలుగల శ్రీ బందా రాయబార ఘట్టమున అత్యద్భుతముగ నటించారు. ఆనాడే మచిలీపట్టణ ప్రముఖులు శ్రీ బందా అగ్రశ్రేణి నటుడౌతాడని ఆశించారు, ఆశీర్వదించారు. వారి ఆశ, ఆశీర్వచనము రెండు యదార్థములైనాయి.



కూచిపూడి నాట్య కళోద్ధారకుడు
శ్రీ బందా

శ్రీ బందా తొలుత న్యాయవాది వృత్తి స్వీకరించినను మనసంతా నాటకరంగముపై ఉండేది. దానితో మనసొకచోట మనువొకచోట అనినట్లుండటచేత తన ప్రధాన కర్మ క్షేత్రముగ నాటక రంగమున యెన్నుకొన్నారు.

ఆనాడు ఆంధ్రదేశమున అగ్రశ్రేణి నటులుగ మాధవపెద్ది, పులిపాటి, స్థానం, యడవల్లి, అద్దంకి, పీసపాటి, కె. రఘురామయ్య ప్రభృతులు మన్నన లొందుతున్నారు. వీరి సరసన సామర్థ్యంతో తగిన నటులుగా శ్రీ బందాకి స్థానం ఉండేది. శ్రీ స్థానం, శ్రీ బందా కాంబినేషన్‌తో నాటక మున్నదంటే ఆరోజు టిక్కట్లు కిక్కట్లే.

## నాటక సంగీతం సాహిత్యం

శ్రీ బందా నటన, పాట వారి సొంత శైలిలో ఉండేది. ఆనాడు ఆంధ్రదేశమున అబ్బూరివారి నాటక సంగీతం ప్రతినోట నానుతోంది. అది అందరికీ ఆదర్శ ప్రాయంగ ఉండేది. నేటికి కొందరామార్గానే అనుసరిస్తున్నారు. కాని నాటకములలో ఆ సంగీతం అంత ఉచితమనిపించదు. కారణము సాహిత్య భావాన్ని మ్రింగేసేదా సంగీతం. పద్యం చదువుట పూర్తియైన తరువాత కొండవీటి చాంతాడుగా రాగం కనీసం ఐదారు నిముషాల కాలంలో ప్రేక్షకులు సాహిత్య భావాల్ని మరిచేవారు. సహనటులకేమిచేయాలో తెలిసేది కాదు. ఈ బాట శ్రీ బందాకి నచ్చక సాహిత్య సంగీతాలకి సమ ప్రాతినిధ్యం యిచ్చి రాగాలాపనకి వ్యవధి తక్కువనిచ్చి సామాజికుల హృదయాలలో భావము తరువాత రసము ఉప్పతిల్లేలా పద్యపఠనం చేసేవారు. అంతేకాదు. ముఖ్యముగ సర్వాంగ సుందరమైన విగ్రహం. దానికి తగిన చక్కని చిక్కని నటనా కౌశలము. అందునా సాత్త్వికాభినయమున బందాది అందెవేసిన చేయి. అందుకే వారిదొక విసూత్న మార్గమని అనాలి. అందుకే శ్రీ బందాని మహానటుడుగ ఆంధ్రదేశము అభిమానించింది.

## వైవిధ్యమున పాత్రపోషణ

శ్రీ బందా మద్రాసులోని న్యాయశాస్త్రాధ్యయనం చేయు కాలమున అవటపల్లివారి ''కాళిదాసు'' నాటకమును ప్రదర్శించుట జరిగినది. నాడు కాళిదాసు పాత్రధారి శ్రీ బందాకే ఉత్తమనటుని బహుమతి. శ్రీ బందా పాత్ర స్వభావమును పరిశీలించి తన శక్తి సామర్థ్యంతో ఆ పాత్రను తులతూచిగాని ఆ పాత్రను స్వీకరించెడివారు కారు. వేదంవారి ప్రతాపరుద్రీయమున పేరిగాడు పాత్రపోషణ మరువలేనిది. శ్రీ బందా శ్రీకృష్ణుడు, సారంగధరుడు, బిల్వమంగళుడు, సలీం, ప్లీడరుశర్మ (మధుసేవ), చంద్రగుప్తుడు, బిక్షుకుడు (చంద్రగుప్త), శ్రీనివాసులు, ఎరుకలసాని, కణ్వుడు, విజయరామారాజు, రాముడు, నల...బాహుకులు, పిచ్చిరామశాస్త్రి (కంఠాభరణము,) రఘునాథ్ (శివాజీ), కాళిదాసు, కాళుడు, పేరిగాడు, అభిమన్యుడు, కర్ణుడు. పాత్రలలో ఒకదాని కొకదానికి స్వభావమున ఎంత వైవిధ్యమున్నదో అది వారి నటనలో కన్పించెడిది. అందువలననే శ్రీ బందాగారిని ''క్యారక్టరు యాక్టరు'' అంటారు. ఈ సమయంలో శ్రీ బందాకి చలన చిత్ర రంగ ఆహ్వానము వచ్చింది. చలన చిత్రములో శ్రీ కృష్ణుడుగా, సారంగ ధరుడుగా కార్యవర్ధి రాజుగా అనేక పాత్రలు పోషించి సాటిలేని నేటి నటులుగా ఖ్యాతి గడించారు.

## నాటక కళాశాల

శ్రీ బందాకి యివన్నీ సంతృప్తిని కలుగజేయలేదు. తాము భావించిన పద్ధతిలో 1942లో ప్రభాత్ థియేటర్సు అను ఒక నాటక సమాజాన్ని ఏలూరులో స్థాపించారు. నటనను ఒక క్రమశిక్షణతోకూడిన విద్యగా భావించి ఆంధ్రనాటక కళాశాల నొక దాని నేర్పరచి దానికి తాము ప్రాచార్యులై అనేక మంది శిష్యులకు శిక్షణనిచ్చి ఇతర ప్రముఖ నటుల నాహ్వానించి వారిచే ఉపన్యాసములిచ్చి నాటక కళలో పరీక్షలు నిర్వహించి ఉత్తీర్ణులైన వారికి

యోగ్యతా పత్రము లొసంగిరి. కొందరు శిష్యులకు విద్యాదానంతోబాటు అన్నదానం శ్రీ బందా యింట జరుగుచుండెది. అనేకమంది నటులకు శ్రీ బందా నూతనబాటలు, మార్గదర్శకాలైనాయి.

శ్రీ బందా పాకకళలో కూడా ప్రావీణ్యులు. తింటే శ్రీ బందా చేతి "గుత్తివంకాయ కూరే తినాలి". వింటే శ్రీ బందా నోట "గుత్తివంకాయ కూరోయ్ బావా..." వినాలి. నలభీమ పాకమనినట్లుగ నలమహారాజు పాత్రతోపాటు ఆయనకు వంటకూడా అలవడినట్లున్నది.

## విదేశీ పర్యటన: ఆకాశవాణి ప్రయోక్త

1952లో శ్రీ బందావారికి కేంద్ర సంగీత నాటక అకాడమీ సభ్యత్వము లభించినది. శ్రీ బందా నాటకరంగానికి చేయు సేవలను గుర్తించి విదేశములలో సాంస్కృతిక రంగమును సమీక్షించి రావలసినదిగ భారత ప్రభుత్వము 1954లో ఐరోపా పర్యటనకు పంపినది. యూరపు దేశస్థుల నాటక రంగమును, సంస్కృతిని అవగాహన చేసుకొని భారతదేశ సంస్కృతిని నాటకరంగ స్థలమును గురించి ఉపన్యాసము లిచ్చిన శ్రీ బందాను భారత ప్రభుత్వము 1956లో విజయవాడ ఆకాశవాణి నాటకప్రయోక్తగ నియమించినది.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రసారంచేసిన ప్రతాప రుద్రీయం, గణపతి, సక్కుబాయి, సలీం యిత్యాది ఉత్తమ రూపకాలకు ప్రయోక్త శ్రీ బందాగారే.

## నాట్యకళోద్ధరణ

కూచిపూడి నాట్యాన్నత్యాన్ని, శాస్త్రీయతను బందా గ్రహించారు. నాటికి కూచిపూడి నాట్యకళ అంటే కొందరికి అధో దృష్టి. ఇదొక వీధి భాగవతము, ఇదొక జానపద నాట్యము అను తలంపుచే కూచిపూడి

నాట్యకళకు ఆదరణ తగ్గినది. అటు నాటక కంపెనీలు, ఇటు సినిమాల ప్రభావం అధికమైంది. అయినను తరతరాలనుండి వస్తున్న కూచిపూడి నాట్యకళను విడువక, తన నూతన శిష్యుడు 'పద్మశ్రీ' వేదాంతం సత్యనారాయణశర్మతో ప్రచారము చేస్తున్న "భరత కళాప్రపూర్ణ" శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ బందా, ముప్పురు మిత్రులైనారు.

ఈ మిత్రత్రయము తొలుత కూచిపూడి నాట్యకళ శాస్త్రీయమైనదని నిరూపింపబూనినారు. శ్రీ బందావారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీచే 1959 ఫిబ్రవరిలో కూచిపూడి నాట్య సదస్సు నొకదానిని యేర్పాటు చేశారు. ఆ సదస్సులో శ్రీ బందావారు కూచిపూడి నాట్య ప్రాచీనతను, సంప్రదాయమును శాస్త్రీయతను గురించి ఆంధ్రమున, ఆంగ్లమున గంభీరముగ ఉపన్యసించి తన మిత్రులు శ్రీ చింతా కృష్ణమూర్తి అధ్యక్షతలోని శ్రీ వెంకటరామ నాట్యమండలిచే భామాకలాపం, ఉషాపరిణయము, ప్రహ్లాద ప్రదర్శన లిప్పించి, అందరినీ మెప్పించి కూచిపూడి నాట్యకళ శాస్త్రీయమైనదని ఒప్పించారు.

శ్రీ బందా బహుభాషాకోవిదులు. సంస్కృతాంధ్రములననే కాక ఆంగ్లం, హిందీ భాషలలో చక్కని చిక్కని రచయిత ఉపరి మహావక్త. శ్రీ బందావారు వేంకటరామ నాట్యమండలివారి నాటకమునకు తొలుత ఆంగ్లమునగాని, ఆంధ్రమునగాని పర్జన్య గర్జా గంభీర గళధ్వానమున ఉపన్యసించి సామాజికులను నాటకాభిముఖులను గావింప సర్వాంగ సుందరముగ, శాస్త్ర సహితముగ, అపర భారత మహర్షిగ శ్రీ చింతా కృష్ణమూర్తి నాటక ప్రయోక్తలై, సూత్రధారులై ప్రయోగింప, పుంసా మోహన రూపాయ అనునట్లు పురుషులకే వెర్రెక్కించు పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారు సత్యగానో, ఉషగానో, మోహినిగనో, రంగస్థలము ప్రవేశింప ఆ మూర్తిత్రయ ప్రజ్ఞకు మోహితుడుగాని సామాజికుడుండడనిన ఆ వంతయు అతిశయోక్తి గానరాదు.

శ్రీ బందా 1960లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రతినిధిగా శ్రీ వెంకటరామ నాట్యమండలితో ఇంటర్ స్టేట్ కల్చరల్ టూరు చేశారు. తమిళనాడులోని ముఖ్య కేంద్రాలన్నింటిలో కూచిపూడి వారి ప్రదర్శనలకు సారధ్యం వహించి జైత్రయాత్ర చేశారు. కూచిపూడి నృత్యకళ చిరస్థాయిగా నిలుపటకు శ్రీ బందా శ్రీ చింతా కృష్ణమూర్తిగారితో నిరంతరం ఆలోచన చేయనారంభించిరి. కూచిపూడిని సందర్శించుటకు నాటి రాష్ట్ర ధర్మాదాయ దేవాలయాల శాఖామాత్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిని ఆహ్వానించివారికి కూచిపూడి నాట్యప్రాచీనతను, ఔన్నత్యామును, సంప్రదాయమును వివరించి దీనికొక కళాశాలను నిర్మించవలసిన అవసరమును తెలుపుచు ఒక వినతిపత్రము సమర్పింప వారా సభయందే తిరుమల తిరుపతి దేవస్థానమునుండి రు. 50,000 మ్యాచింగ్ గ్రాంట్ యిప్పించెదమని వాగ్దానము చేశారు.

1961లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీనుండి రు. 25,000 క్షీరసాగర మధనమును నిర్మించుటకు శ్రీ బందా నిర్మాతగ ఒడంబడికను కుదుర్చుకొని శ్రీ వెంపటి చినసత్యంగారిచే దానిని రూపొందించి కూచిపూడి వేంకటరామ నాట్యమండలి సభ్యులచే ప్రదర్శింపజేసి ఆ ధనముచే కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రమును నిర్మించి తాను కార్యదర్శియై కూచిపూడి కళకి అజరామరత్వమును కలిగించిరి. అంతే కాక కేంద్ర ప్రభుత్వమునుండి ఒక లక్ష రూపాయలు తెచ్చి ఒక ప్రదర్శనశాల నేర్పరచిరి. ఈ విధముగ కూచిపూడి నాట్య కళోద్ధారకుడుగ శ్రీ బందా ఖ్యాతిగాంచిరి.

కూచిపూడి నాట్యకళకు శ్రీ బందా చేయుచున్న సేవలను గుర్తించి కేంద్ర సంగీత నాటక అకాడమీ 1963...64 సంవత్సరపు అవార్డుతో గౌరవించినది.

శ్రీ బందా నటనా కౌశలమునకు, కళాసేవకు కూచిపూడి నాట్యకళోద్ధరణకు ముగ్ధులై మహామహోపాధ్యా శ్రీ జమ్మలమడక

మాధవరాయశర్మ తమ నాట్య వేదమును అంకితమిచ్చి కృతిభర్తను చేసిరి.

శ్రీ బందా కూచిపూడి నాట్యమునకు తమ జీవితమునే నైవేద్యం చేసిరి. తన చివరి ఘడియలలో కూచిపూడినే తారక మంత్రంగ జపించిరి. శ్రీ బందా 3.12.1968న మృతి చెందారు. శ్రీ బందా లోటు కూచిపూడికి అశనిఘాతమైనది. కూచిపూడివారు ప్రతి సంవత్సరము శ్రీ బందా వర్ధంత్యుత్సవములు జరుపుకొనుట ముదావహమైన విషయం.

# నాడు...నేడు... కూచిపూడి

1949 వ సంవత్సరమున కూచిపూడి కళాక్షేత్రమున నొక పారిజాతము తన పరిమళమును దేశము నాలుగు చెరగులుకు వెదజల్లి రాలిపోయినది. ఆ పారిజాతమే కూచిపూడి యక్షగానపితామహులు' శ్రీ చింతా వెంకటరామయ్యగారు. శ్రీ చింతా వెంకటరామయ్యగారి అస్తమయముతో చింతావారి మేళము దుఃఖసాగరమున మునిగితేలినది. వారి పుత్రులు శ్రీ చింతా రామమూర్తిగారు. 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారు అగణితమయిన వారి శిష్యకోటి శ్రీ చింతా వెంకటరామయ్యగారి వర్ధంత్యుత్సవములను ఉన్నతస్థాయిలో నిర్వహింప సమకట్టిరి. నాటికి కూచిపూడిలో మహంకాళివారి మేళము, పసుమర్తివారి మేళము, భాగవతులవారి మేళములలోని మేటి నట్టువోజులు అందరు ప్రదర్శనలిచ్చు ఏకాభిప్రాయమునకు వచ్చిరి. ప్రహ్లాద, ఉషాపరిణయము, గయనాటకము, ఇత్యాదులను చాక్షుషక్రతువుగ కనులపండువుగ ప్రదర్శించిరి. శ్రీ చింతా రామమూర్తి కృష్ణమూర్తిగార్లు పై సంఘములలోని సభ్యులందరిని ఏకత్ర సమావేశపరిచి వారినందరిని... చింతావరి మేళము... శ్రీ వెంకటరామయ్యగారి నాట్యమండలి ఛత్రము క్రిందకు తీసికొని వచ్చిరి... శ్రీ వెంకటరామయ్యగారే ఈ వెంకటరామ నాట్యమండలి...చింతావారి మేళము... వ్యవస్థాపకులు. దీనిని వీరు 1875వ సంవత్సరమున స్థాపించిరి. ఆంధ్రదేశ నాటకరంగము నందు నూరుసంవత్సరములు అవిచ్ఛిన్నముగ కొనసాగిన నాట్యమండలి శ్రీ వెంకటరామ నాట్యమండలి వినా మరేదియు లేదనిన నత్యుక్తికాదు. కూచిపూడిలోని ప్రముఖ నట్టువోజులు నటులు ప్రత్యక్షముగనో పరోక్షముగనో శ్రీ వెంకటరామయ్యగారికి శిష్యులే. అదేవిధముగ ప్రముఖ నటశేఖరులందురు శ్రీ వెంకటరామ నాట్యమండలి...చింతావారి మేళము...లో సహభాగత్వము నొందినవారే. శ్రీ చింతా వెంకటరామయ్యగారి వర్ధంతితో కూచిపూడిలోని మూడు నాలుగు మేళములు ఒక్క చింతావారి

మేళముగ రూపొందినది. ఈ వెంకటరామ నాట్యమండలి కధినాథులు శ్రీ చింతా రామమూర్తిగారు. శ్రీ రామమూర్తిగారి కాంగ్రెస్ సంవత్సర మాధిపత్యము వహించి 1950వ సవంత్సరమున స్వర్గస్థులయిరి. అంత ఈ నాట్యమండలి బరువుబాధ్యతలతోపాటు పరువు ప్రతిష్టలును శ్రీ చింతా కృష్ణమూర్తి గారి భుజస్కంధములపై బడినవి.

శ్రీ చింతా కృష్ణమూర్తిగారు తమ అన్నగారి అకాలమృత్యువు అశనిఘాతమైనది. సుమారు రెండు సంవత్సరముల కాలము కూచిపూడి నాటక కళకు గ్రిహణము పట్టినది. నాటి వీరి మేళములోని స్త్రీపాత్రిధారి యయిన శ్రీ పసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రోత్సాహముతో ధైర్యవచనములతో శ్రీ కృష్ణమూర్తిగారు మేళపు నాయకత్వము వహించిరి. నాటి మేళములందు 'పాళ్ళ' పద్ధతి యుండెడిది. మేళములోని సభ్యులందరి పాళ్ళను కలిపి సంపాదించిన ద్రవ్యమును పాళ్ల ప్రకారము పంచుకొనెడివారు. శ్రీ కృష్ణమూర్తిగారు అతివాకచక్యముగ సంఘసభ్యులందరిని అనతికాలములోనే కూడగట్టుకొనిరి. వీరికి శ్రీ మహంకాళి సత్యనారాయణగారు కుడిభుజమై బాసటగ నిలిచిరి. నాటి వీరి మేళమున శ్రీ పసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిగారితోపాటు స్త్రీ భూమికలను శ్రీ చింతా సీతారామాంజనేయులుగారు ధరించుచుండిరి. ఈ మేళము లందు సామాన్యముగ స్త్రీ భూమికలు ధరించువారికి గౌరము ప్రాబల్యము మెండుగ నుండెడిది.

శ్రీ కృష్ణమూర్తిగారి దృష్టి నూతన స్త్రీ పాత్రధారి యన్వేషణలో కొనసాగినది. అతఃపూర్విమే 5 న ఊమికల నిర్వాహణలో పేరుగాంచిన 'భరత కళాప్రపూర్ణ' శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగార్లు మద్రాసులోని తెలుగు చలనచిత్రరంగమందు ప్రవేశించిరి. శ్రీ కృష్ణమూర్తిగారి దృష్టి నూనూగుమీసముల నూతన యౌవనము సంతరించుకొనుచుండగ శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారిపై సారినది. శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ సత్యనారాయణశర్మగారిని పిలిచి యక్షగాన నాయికభూమికలను

పోషించు విధమును సాభినయముగ నృత్యనృత్తములతో సులభశైలిలో బోధించుటారంభించిరి. రెండు మూడు వసంతములలో సూక్ష్మగ్రాహియైన శ్రీ సత్యనారాయణశర్మగారు కృష్ణమూర్తిగారి బాణీని అలవర్చుకొనిరి. కూచిపూడికి పరిసర గ్రామమయిన పెదముక్తేవి గ్రామమునందు శ్రీ కృష్ణమూర్తిగారు యక్షగాన ప్రయోక్తలై శ్రీ శర్మగారిచే ఉషాపరిణయమున 'ఉష' పాత్రను ధరింపజేసిరి. ముగ్ధయైన ఉష పాత్ర కనువుగ నున్నది శ్రీ శర్మగారి వయసు. శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ శర్మగారిని పాత్రధారిని చేసి యక్షగాన సంప్రదాయసరణులలో ఆడించి ఆ ప్రదర్శనను విజయవంతముగ ముగించిరి. ఏ శుభముహూర్తమున శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ శర్మగారిచే ఉష వేషము వేయించిరోగాని నాటి నుండియే శ్రీ శర్మగారికి సన్మానములు ప్రారంభమయినవి. దీనితో శ్రీ శర్మగారు వేంకటరామ నాట్యమండలిలో భాగస్వాములైరి.

శ్రీ శర్మగారికి కృష్ణమూర్తిగారు ఉష సత్యభామ గొల్లభామ మోహిని యిత్యాది శృంగార నాయిక పాత్రల మర్మమును విడదీసి విపులముగ సులభశైలిలో అందించిరి. నాటినుండి ఉషాపరిణయమున ఉష, భామాకలాపమున సత్యభామ, గొల్లకలాపమున గొల్లభామ, మోహినీరుక్మాంగదయందు మోహిని పాత్రలను ధరించు అవకాశము శ్రీ శర్మగారికీయబడినది. నవరస నటులైన కృష్ణమూర్తిగారు శ్రీ శర్మగారి రంగస్థల ప్రవేశముతో ప్రముఖ సూత్రధారులైరి. కాని మోహినీ రుక్మాంగద యందు రుక్మాంగదుడు, రామనాటక, గయనాటక శశిరేఖా పరిణయములందు రామ, కృష్ణ భూమికలు నిర్వహించుచుండిరి. వీరు భూమికల నిర్వహణయందున్న సూత్రధారి లోపము కన్పట్టుచుండెను. సామాజికులు అందువలన ఉషాపరిణయము, భామాకలాపము నాటకములనే ఎక్కువ వాంఛించుటచే మిగిలినవి వెనకంజ వేసినవి. అయినను శ్రీ మహంకాళి సత్యనారాయణగారు రాజపాత్రధారి యగుటచే ప్రహ్లాద వీనితో సమానముగ పాలుపంచుకొనెడిది. ప్రహ్లాద, ఉషాపరిణయము,

భామాకలాపములు శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ సత్యనారాయణ శర్మగారు, శ్రీ మహంకాళి సత్యనారాయణగార్ల నిర్వహణలో శ్రీ వేంకటరామ నాట్యమండలి జైత్రయాత్ర చేయుచుండెను.

ఈ సమయమునందు కూచిపూడి నాట్యకళ అశాస్త్రీయమను దుమారము రేగినది. శ్రీ వేంకటరామ నాట్యమండలి సభ్యులందరితో మద్రాసులోని 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెద్దసత్యంగార్ల సహకారముతో శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి సారథ్యములో హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యమున కూచిపూడి నాట్యసదస్సునుత్సవములో కూచిపూడి నాట్యకళ సశాస్త్రీయమేనని ఋజువు చేసిరి.

ఈ మహోత్సవమునందు ఆచార్య శ్రీ విస్సా అప్పారావు, డా. శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావు, శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ భాగవతుల రామకోటయ్య, శ్రీ పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ లంకా సూర్యనారాయణ, ప్రభృతులు కూచిపుడి నాట్యకళౌన్నత్యమును, శాస్త్రీయతను, పురాతనత్వమును వివరించుచు వ్యాసములు చదివి కూచిపూడి నాట్యకళకు కూచిపూడి భాగవతులకు మహోపకార మొనర్చిరి.

కూచిపూడి యందు పూర్వము ప్రతి యింటియందుగాని యింటి ముంగిటగాని నృత్యమును నేర్పు గరిడీలుండెడివి. ఆధునికులు వానికి బదులుగ కళాశాలల నేర్పాటు చేసుకొనిరి. కూచిపూడియందు తొలుత 1947లో శ్రీ భాగవతుల రామకోటయ్యగారు శ్రీ సిద్ధేంద్ర నాట్యమండలిని స్థాపించిరి. వీరికి శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, ఎమ్.ఏ.,గారి సలహాసంపత్తులు లభించినవి. ఇందు శ్రీ రామకోటయ్యగారు ప్రధానాచార్యులు. ఈ మండలి రెండు గ్రీష్మములను మాత్రమే చూచినది.

శ్రీ భాగవతుల రామకోటయ్యగారి తరువాత శ్రీ వెంపటి రాధాకృష్ణ కూచిపూడి కళను చిరస్థాయిగ నిలుపుటకై యొక ప్రణాళికను రూపొందించి దాని నమలు పరుచుటకై 'లలిత

కళాక్షేత్రమ్' అను సంస్థను కూచిపూడి యందు స్థాపించిరి. వీరికి ప్రణాళిక రచన యందు శ్రీ మహంకాళి లక్ష్మీనరసింహంగారు సహకరించిరి. ఈ సంస్థకు చల్లపల్లి జమీందారులయిన శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దూర్‌గారు అధ్యక్షులు, 'రైతుపెద్ద' శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, 'నటశేఖరులు' శ్రీ వేదాంతం రామకృష్ణయ్యగార్లు ఉపాధ్యక్షులు డా. శ్రీ భాగవతుల హనుమంతరావుగారు కార్యదర్శి. శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ మహంకాళి సత్యనారాయణ శ్రీ వేదాంతం పార్వతీశం, శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ, శ్రీ మహంకాళి లక్ష్మీనరసింహం ప్రభృతులు కార్యవర్గ సభ్యులు. ఈ సంస్థయు నాలుగైదు వసంతములను మించి చూడలేదు.

ఈ సమయమునందే ఆంధ్ర నాటకరంగమున తిరుపతి వేంకటకవుల ఉద్యోగ విజయములు, చిలకమర్తివారి గయోపాఖ్యానము, బలిజేపల్లివారి హరిశ్చంద్ర, నాటకముల ప్రాచుర్యము ప్రభావము అధికమయినది. ఇతఃపూర్వమే ఆంధ్రులు ధార్వాడా వారి నాటకములను, సురభివారి నాటకములను రుచిచూచిరి. ఇంతేకాక తెలుగు చలనచిత్రముల ప్రభావమధికము కాజొచ్చినది. ఇట్టితరి కూచిపూడి వ్యస్తనృత్యాంశములు, యక్షగానములు ప్రజల నాకట్టుకొనుటలో వైఫల్యమును పొందినవి. ఇక కూచిపూడి వారు యక్షగానములను వదలలేక చేయునదిలేక ఉద్యోగ విజయములు, గయోపాఖ్యానము, హరిశ్చంద్ర పైన దెలిపిన కవుల నాటకములను చేపట్టిరి. భరత విద్యాధురంధులగు కూచిపూడి భాగవతుల కరకమలములందీ నాటకములను రాణించినవి.

ఏది ఏమయిన యక్షగానముల ప్రాచుర్యము తగ్గినదని గ్రహించిన కొంతమంది కూచిపూడి ప్రముఖ నట్టువోజులు శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెదసత్యం, శ్రీ వెంపటి చినసత్యం, శ్రీ వేదాంతం జగన్నాథ శర్మగార్లు నృత్యదర్శకులుగ, శ్రీ బొక్కా కుమారస్వామి, శ్రీ వెంపటి శ్రీరామమూర్తి, శ్రీ యేలేశ్వరపు వాసుదేవశాస్త్రి వయొలిన్

వాద్యకారులుగ, శ్రీ మహంకాళి వెంకయ్య, శ్రీ మహంకాళి నరసింహం నటులుగ, శ్రీ వెంపటి కృష్ణమూర్తి, l వెంపటి ముక్తేశ్వరరావు తబల, మృదంగ వాద్యకారులుగ మద్రాసులోని తెలుగు చలనచిత్రరంగమందు ప్రవేశించిరి.

కాని శ్రీ చింతా కృష్ణమూర్తిగారేనాటికైన కూచిపూడి నాట్యకళ కుజ్వల భవిష్యత్తు రాగలదని ఆశించి కలలు గనుచు తమకు చలనచిత్రరంగమునందు అవకాశము వచ్చినను దానిని పరిత్యజించి సంప్రదాయసిద్ధమై వచ్చు భాగవతకళనే యారాధించుచుండిరి. శ్రీ కృష్ణమూర్తిగారి కలలు ఫలించినవి. ప్రజాభిరుచి యందు మార్పు వచ్చినది. కూచిపూడి నాట్యమనిన అభిరుచి పెరిగినది. అదనుకొరకు వేచియున్న కృష్ణమూర్తిగారీ అవకాశమును సద్వినియోగపరచుకొనుచు పునః భామ, గొల్లకలాపములు, ప్రహ్లాద, ఉషాపరిణయ మిత్యాది యక్షగానములను పురుజ్జీవింపచేయుటకు కంకణము కట్టుకొనిరి.

1951వ సంవత్సరమున డా. బెజవాడ గోపాలరెడ్డిగారు ఆర్థికశాఖామాత్యులుగ నున్న సమయమున శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారితో కలిసి కూచిపూడి కళాక్షేత్రమును దర్శించిరి. నాటి పౌరసన్మానానంతరము సభలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఆంధ్రుల జాతీయ నృత్యకళ యయిన కూచిపూడి నాట్య పునరుద్ధరణమునకు, సుస్థిరత్వమునకు ప్రచారమునకు కూచిపూడి యందొక నృత్యకళాశాలను నిర్మించవలయునను అభిప్రాయమును వెలిబుచ్చిరి.

1952 వ సంవత్సరములో గుంటూరునందు శ్రీ వెంపటి వెంకటనారాయణశాస్త్రిగారి వర్ధంత్యుత్సవములందు శ్రీ వేంకటరామ నాట్యమండలి కధినాథులైన శ్రీ చింతా కృష్ణమూర్తిగారిని భామాకలాప ప్రదర్శమున ఆహ్వానించిరి. శ్రీ కృష్ణమూర్తిగారు శ్రీ భాగవతుల నరసింహంగారిని భామగ, శ్రీ వేదాంతం పార్వతీశంగారిని కృష్ణునిగ భూమికలను నిర్వహించుటకై గైకొని తాము మాధవి, కలాప ప్రయోక్తలై భామాకలాపమును ప్రదర్శించి సన్మానమును పొందిరి.

దేవస్థానములందు వార్షికములుగ వచ్చు నాహ్వానములు శ్రీ

వేంకటరామనాట్యమండలికి పునః ప్రారంభమైనవి. ఆంధ్రదేశమందంతటనుండి ప్రదర్శనార్థము పిలుపు రాదొడగినవి. అంతేకాక భారతదేశ రాజధాని యయిన ఢిల్లీ నగరము శ్రీ వేంకటరామ నాట్యమండలికి స్వాగతము పలికినది. ఈ మండలి ఉత్తరదేశమందడుగిడినది.

ది 15.8.1957 సంవత్సరమున శ్రీ వేదాంతం పార్వతీశంగారు ప్రధానాచార్యులుగ కూచిపూడి యందు శ్రీ సిద్ధేంద్ర నాట్య కళాశాల స్థాపింపబడినది. వీరగణితమయిన శిష్యులకు శిక్షణ యిచ్చుచుండిరి. కాని యీ సంస్థ రిజిష్టరు చేయబడలేదు.

ఈ సమయమున శ్రీ బందా కనకలింగేశ్వరావుగారి దృక్పథమున కూచిపూడి నృత్యకళ మెరసినది. శ్రీ బందావారు శ్రీ కృష్ణమూర్తిగారు సన్నిహితులయిరి. ఆప్తులయిరి. కురుక్షేత్రమున అర్జునునకు శ్రీకృష్ణుడు రథ సారధి అయినట్లు కృష్ణమూర్తిగారికి బందాగారి సారథ్యము లభించినది. శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు జగమెరిగిన ప్రథమశ్రేణి నటులు. విదేశపర్యటనలు చేసిన ఘనపాఠి. ఉపరి న్యాయవాది. శ్రీ వేంకటరామ నాట్యమండలి వారికి భారతదేశము నలుమూలల నుండి ప్రదర్శనముల కొరకు ఆహ్వానములు వచ్చినవి. ఇట్టి తరి శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు కూచిపూడి నాట్యకళౌన్నత్యమును, ప్రాచీనతను, ప్రయోగవిధానమును ప్రదర్శనేతివృత్తమును, కళాకారుల నిష్ణాతృత్వములను గూర్చి ప్రదర్శనకు ముందుగనే సామాజికులకు ప్రరోచన కలుగజేసి సామాజికులను ప్రయోగాభిముఖులను జేయనారంభించిరి. సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీభాషలలో అనర్గళముగ ఉపన్యసించగల మహావక్త శ్రీ బందా కనకలింగేశ్వరరావు. వీరి ఉపన్యాసానంతరము శ్రీ కృష్ణమూర్తిగారి సూత్రధారణలో శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారి స్త్రీపాత్రధారణతో యక్షగానము లారంభమై ఆంధ్రులను, ఆంధ్రేతరులను ఆకర్షించి అచిరకాలముననే బహుళప్రచారము నొందినది.

1958లో ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి కూచిపూడి యక్షగానములను రికార్డుచేయుటకు శ్రీ కృష్ణమూర్తిగారి నాహ్వానించిరి శ్రీ చింతా కృష్ణమూర్తిగారి సంప్రదాయ సంగీతసరణులలో భామాకలాపము, గొల్లకలాపము, ప్రహ్లాద, ఉషాపరిణయము, రామనాటకము, శశిరేఖాపరిణయములను పాడగ 'స్వరబ్రహ్మ' శ్రీ వోలేటి వేంకటేశ్వర్లుగారు స్వరపరచిరి. వీనియందు నాయక నాయిక పాత్రలు డా. మంగళంపల్లి బాలమురళీకృష్ణ, కుమారి శ్రీరంగం గోపాలరత్నంగార్లు పోషించిరి. కుమారి వింజమూరి లక్ష్మి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, శ్రీ యం.వి. రమణమూర్తి, శ్రీ పి. సూర్యారావు, శ్రీ ద్వారం భావనారాయణ, శ్రీమాన్ ఎన్.సి.పి. జగన్నాధాచార్యులు, శ్రీ పాతూరి మధుసూదనశాస్త్రి, శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి, శ్రీ భాగవతుల సీతారామశర్మ, శ్రీ పసుమర్తి ఆంజనేయులు, శ్రీ పసుమర్తి సీతారామయ్య, ప్రముఖ కర్ణాటక సంగీత విద్వాంసులు, విదుషీమణులు పాల్గొని కూచిపూడి సంప్రదాయ, సంగీతమునకు అజరామరత్వము చేకూర్చిరి. కూచిపూడి సంగీత సంప్రదాయ సరణులను భద్రపరచి ప్రచారము చేయుచున్న ఆకాశవాణి విజయవాడ కేంద్రము వారు శ్లాఘనీయులు.

ఏ శుభముహూర్తమున 'భామాకలాపము' రికార్డయి ప్రసారము చేయబడినదోగాని నాటినుండి పునరుజ్జీవింపబడి అనతికాలమున బహుళ ప్రాచుర్యము నొందినది.

కూచిపూడి నృత్యకళ చిరస్థాయిగా నిల్చుటకు శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ, శ్రీ బందా కనకలింగేశ్వరరావుగార్లు నిరంతర మాలోచన చేయదొడంగిరి. కూచిపూడిని సందర్శించుటకు రాష్ట్ర ధర్మాదాయ దేవాదాయ శాఖామాత్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిని ఆహ్వానించి కూచిపూడి నృత్యకళకు స్థిరత్వము కలుగవలెనని నొక కళాశాలను కూచిపూడి యందు నిర్మించవలయునని శ్రీ బందా వారుద్ఘాటించి యొక వినతిపత్రమును అమాత్యుల కొసగిరి. వీరి సంకల్పబలమెట్టిదోగాని ఆ సభయందప్పుడే శ్రీ కల్లూరి

చంద్రమౌళిగారు తిరుమల తిరుపతి దేవస్థానమునుండి రు. 50,000 విరాళముగ నిచ్చెదమని వాగ్దానము చేసిరి.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అధ్యక్షులుగ, శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు కార్యదర్శిగ, శ్రీ నర్రా వేంకటరత్నంగారు ఉపాధ్యక్షులుగ, శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ, శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెదసత్యంగార్లు డైరెక్టర్లుగ శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రమును నొక నాట్యకళాశాలను రిజిష్టరు చేసి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి అనుబంధము చేసిరి.

1960వ సంవత్సరన రాష్ట్రప్రభుత్వము ఉన్నతస్థాయిలో క్షేత్రయ్య యుత్సవములను మొవ్వ గ్రామమున నిర్వహించి అతని పేరుమీద నొక అభినయశాలను నిర్మించి అందు కూచిపూడి నాట్యాచార్యులను నియమించిరి.

ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ 1961వ సంవత్సరమున కూచిపూడి వేంకటరామ నాట్యమండలి సభ్యులచే 'క్షీరసాగర మధనము'ను చేయదలచి అందులకు రు. 25,000 ద్రవ్యము నొసంగుచు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారిని నిర్మాతగ ఒడంబడిక నేర్పరచినది. ఈ క్షీరసాగర మధనము శ్రీ వెంపటి చినసత్యంగారు నిర్దేశకులుగ రూపును సంతరించుకొనినది. ఇందు కుమారి యామినీ కృష్ణమూర్తి విశ్వమోహినిగ, శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ శ్రీ మహావిష్ణువుగ, ధన్వంతరిగ, శ్రీ మహంకాళి సత్యనారాయణ బలిచక్రవర్తిగ, శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ దేవేంద్రునిగ శ్రీ వెంపటి చినసత్యం శివునిగ శ్రీ పసుమర్తి రత్తయ్య లక్ష్మిగ, శ్రీ మహంకాళి శ్రీమన్నారాయణ వాసుకిగ, శ్రీ చింతా కృష్ణమూర్తి సూత్రధారునిగ, శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ, కుమారి జ్యోతిష్మతి, శ్రీ భాగవతుల సీతారామశర్మగార్లు సహకార గాయకులుగ క్షీరసాగరమును మధించి అమృతము నుద్భవింపజేసిరి. ఏ తత్ఫలితముగ కూచిపూడిలోని శ్రీ రామలింగేశ్వరస్వామినుండి నాలుగు ఎకరముల భూమిని కొనుట, అందు శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రము, శ్రీ వేంకటేశ్వర భవనము నిర్మించుట జరిగినది.

తరువాత కేంద్ర సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ హుమాయూన్ కబిర్‌వారి సౌహార్దతతో కేంద్రప్రభుత్వ ఆర్థిక సహాయముతో ప్రదర్శనశాల నొకదానిని నిర్మించిరి.

ఈ శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర వేంకటేశ్వర భవనమును 1...1...1965న నాటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ప్రారంభోత్సవము చేసిరి.

శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రమునకు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు ప్రాచార్యులయిరి. శ్రీ వేంకటరామ నాట్యమండలి ఈ కళాక్షేత్రమునకు అనుబంధసంస్థ యయినది.

1961వ సంవత్సరమున శ్రీ వేంకటరామ నాట్యమండలికి అంతర్ రాష్ట్ర సాంస్కృతిక యాత్ర చేయు నవకాశము కలిగినది. కళలకు కాణాచి యయిన తమిళనాడు రాష్ట్రమందు పలుచోట్ల శ్రీ బందావారి సారథ్యమున ప్రదర్శనలిచ్చి అచ్చట ప్రముఖ కళాకారులుగ గుర్తింపబడిన మేలట్టూరు భాగవతుల ప్రశంశలనందుకొని శ్రీ వేంకటరామ నాట్యమండలి జైత్రయాత్రను జేసినది. ఈ యాత్ర యందు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు యక్షగానప్రయోక్తగ భామాకలాపము, ప్రహ్లాద, ఉషాపరిణయములను ప్రదర్శించిరి. దీనితో వెంకటరామ నాట్యమండలికి ఉత్తర దక్షిణ భారతములు రెండును రంగస్థలములయినవి. ఈ మండలి సంభ్యులు పొందని సన్మానములు లేవు.

కూచిపూడి నాట్యకళ పొందుచున్న పురస్కారములు శ్రీ సత్యనారాయణ శర్మగారిని 1961లో భారత ప్రభుత్వము కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డునిచ్చి కూచిపూడి నాట్యకళను సన్మానించినది.ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ 1964లో శ్రీ వేదాంతం రాఘవయ్యగారిని 'భరత కళాప్రపూర్ణ' భిరుదాంచితులను చేసినది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1965లో శ్రీ చింతా కృష్ణమూర్తిగారిని 'భరతకళాప్రపూర్ణ'లను చేసి సత్కరించినది. 1967లో భారత ప్రభుత్వము శ్రీ వేదాంతం

సత్యనారాయణశర్మగారికి ఫెలోషిప్‌నిచ్చి సముచితరీతిని గౌరవించినది. 1968లో శ్రీ చింతా కృష్ణమూర్తిగారికి కేంద్ర సంగీతనాటక అకాడమీ అవార్డు రు. 5,000 నగదు నిచ్చి సంభావించినది. 1970లో భారత ప్రభుత్వము శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మని పద్మశ్రీని చేసినది. 1978లో కేంద్రప్రభుత్వము శ్రీమాన్ సి.ఆర్. ఆచార్యులుగారికి ఫెలోషిప్ నిచ్చి గౌరవించినది. 1978లో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ డాక్టర్ వెంపటి చినసత్యమును భరతకళా ప్రపూర్ణులుగా సన్మానించినది. తరువాత పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మని ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ భరతకళా ప్రపూర్ణులను చేసినది. 1979లో శ్రీ కోరాడ నరసింహారావుగారిని ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ 'భరత కళాప్రపూర్ణ'ను చేసి సన్మానించినది. ఈ విధముగ కూచిపూడి నాట్యకళ కేంద్ర రాష్ట్రప్రభుత్వములచే అనేక పురస్కారములను పొందుచున్నది.

1968వ సంవత్సరమున శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు పరమపదించిరి. వారి స్థానమున శ్రీ జి.యస్.ఆర్. ఆంజనేయులుగారు శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర కార్యదర్శిగ నియమితులయిరి.

1969వ సంవత్సరమున 'భరత కళాప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారు స్వర్గస్థులయిరి. వారి స్థానమున సిద్ధేంద్ర కళాక్షేత్రమున సిద్ధేంద్ర కళాక్షేత్ర ప్రధానాచార్యులుగ శ్రీ వేంకటరామ నాట్యమండలి కధ్యక్షులుగ 'పద్మశ్రీ' వేదాంతం సత్యనారాయణశర్మగారు నియమితులయిరి. అటు నాట్యమండలి కార్యక్రమములకు ఇటు ప్రధానాచార్య విధినిర్వహణమునకు పొత్తుకుదరక శ్రీ శర్మగారు 1971వ సంవత్సరమున ఆచార్యపదవికి రాజీనామా చేసిరి. అంత ప్రధానాచార్యులుగ శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణ శర్మగారు నియమితులయిరి.

1975వ సంవత్సరమున అంతర్జాతీయ తెలుగు మహోత్సవములు ఆంధ్రప్రదేశ్ రాజధాని యగు హైదరాబాదునందు

రాష్ట్రప్రభుత్వముచే నిర్వహింపబడినవి. అందు కూచిపూడి ప్రముఖ కళాకారులందురు పాల్గొని సన్మానింపబడిరి. ఈ మహోత్సవమునకు ఆహూతులుగ విదేశములనుండి వచ్చిన తెలుగువారందరు కూచిపూడికి నాహ్వానింపబడిరి. కూచిపూడి యందు రాష్ట్రప్రభుత్వము వారా సమయమున అఖిలభారత కూచిపూడి నృత్యోత్సవములు జరిపిరి. ఈ సదస్సునకు నాటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఓబులరెడ్డిగారధ్యక్షత వహించిరి. రాష్ట్ర విద్యా సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారాహ్వాన సంఘాధ్యక్షులు. ఈ నృత్యోత్సవమునందు 'పద్మశ్రీ' వేదాంతం సత్యనారాయణ శర్మ, మద్రాసులోని కూచిపూడి ఆర్ట్సు అకాడమీ వ్యవస్థాపకులు ప్రాచార్యులు శ్రీ వెంపటి చినసత్యంగారు వారి బృందము, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెదసత్యం, శ్రీమతి రాజసులోచన, కుమారి శాంతి వేదాంతం, శ్రీ వేదాంతం జగన్నాథశర్మ, హైదరాబాదులోని కూచిపూడి నృత్య గురుకుల వ్యవస్థాపకులు ప్రాచార్యులు శ్రీ భాగవతుల రామకోటయ్య, వారి బృందము; ఏలూరు కూచిపూడి నాట్య కళాశాల ప్రధానాచార్యులు శ్రీ వేదాంతం ప్రహ్లాద శర్మ, శ్రీ వేదాంతం సీతారామశాస్త్రివారి బృందము, హైదరాబాదు నృత్యశిఖర దర్శకురాలు శ్రీమతి సుమతీ కౌశల్, అహమ్మదాబాద్‌నుండి శ్రీమాన్ సి.ఆర్. ఆచార్యులు వారి బృందము, కుమారి రత్నపాప, ఇత్యాది ప్రముఖ నర్తకులు, నర్తకీమణులు, ఆచార్యులు కూచిపూడి నాట్యభారతి నావిష్కరించిరి.

కూచిపూడి నాట్య ప్రాచీనతను, శాస్త్రీయతను, అభివృద్ధికి మార్గములను, ఔన్నత్యమును గురించి శ్రీ లక్ష్మణయతీంద్రులు; డా: శ్రీ పిఫ యస్. ఆర్ అప్పారావు, శ్రీ వెంపటి పెదసత్యం, శ్రీ వెంపటి చినసత్యం, శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, శ్రీ కోరాడ నరసింహరావు, శ్రీ పి.వి.జి. కృష్ణశర్మ, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ భాగవతుల రామకోటయ్య, శ్రీ చింతా రామానథం ప్రభృతులు ఉపన్యసించిరి.

నేడు రాష్ట్ర ప్రభుత్వమునకు చెందిన టెక్నికల్ ఎడ్యుకేషన్ మరియు శిక్షణశాఖ వారు కూచిపూడి నృత్యము నందు సర్టిఫికెట్, డిప్లమో పరీక్షలను నిర్వహించుచున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి యాజమాన్యములోని పాఠశాల యందు కూచిపూడి నాట్యశాఖ నేర్పరచి 'ఉత్తమ నాట్యాచార్య' శ్రీ పసుమర్తి సీతారామయ్యగారిచే శిక్షణ నొసంగుచున్నది. రాష్ట్ర ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల అందు కూచిపూడి నాట్యశాఖ నేర్పరచి శిక్షణ నిచ్చుచుండిరి.

ఆధునిక కవులయిన శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారు 'విప్రనారాయణ'ను, శ్రీ వేదాంతం పార్వతీశంగారు 'దక్షయజ్ఞము' 'చింతామణి' శ్రీ దండిభొట్ల వెంకటశాస్త్రి 'పార్వతీ కల్యాణము' యక్షగానములను రచించి కూచిపూడి యక్షగానములను సుసంపన్నము గావించిరి.

## నేటి ప్రక్రియా భేదములు:

నేడు శ్రీ వెంపటి చినసత్యంగారి దర్శకత్వము క్రింద నృత్యనాటికలు విరాజిల్లు చున్నవి. ఇవి ఆంగ్లభాషలో 'బాలే'ల వంటివి. వీరు నృత్యనాటకలయిన యక్షగానలములను వదలి నృత్యనాటికలను గైకొనుటకు కారణము గలదు. యువ కళాకారులందు సామర్థ్యలోపము గన్పట్టుచున్నది. ఇట నృత్యనాటకము అయిన యక్షగానములకు నృత్యనాటికలకు గల తారతమ్యము తెలుపు టావశ్యకము.

నృత్యనాటకము అయిన యక్షగానములు గాన నృత్య ప్రధానములు, సంవాదశిలీ విన్యాసములు. ఇవి ఆంగ్లభాషలో 'ఒపేరా'ల వంటివి. ఇందు పాత్రధారులకు నృత్యము, సంగీత సాహిత్య పరిజ్ఞానము అవసరము. పాత్రధారి దరువులను పాడుచు అభినయించుచు నృత్యము చేయవలయును. యక్షగాన ప్రయోక్త నా పాత్రధారి పాటను సామాజికులకు స్పష్టపరచుటకై మదింపుగ పునరావృత్తము చేయుచు పాత్రధారిని యాడించును. అనగా నృత్యనాటకము అయిన యక్షగానము అందు చతుర్విధాభినయము అయిన ఆంగిక, వాచిక,

ఆహార్య, సాత్వికాభినయములకు సముచితస్థాన ముండును. ఇక నృత్యనాటికల యందు నేపథ్యగానము ప్రముఖపాత్ర వహించుచుండును. పాత్రధారులకు వాచికాభినయం వుండదు. ఆంగీక ఆహార్య సాత్వికభినయ వుండును. సందివచనలు రెండింటి యందు యుండును. నృత్య నాటికలను సంవాదశైలులే. వినయం దాంగికాభినయ మధికముగ కన్పట్టుచుండును. ఇవియు సశాస్త్రియములే. పండిత పామరజనరంజకములే. నేడు వీటి ప్రదర్శనల యందు రంగస్థల పటాటోప మెక్కువగ కన్పట్టుచున్నది. యక్షగానము లందు రంగాలంకరణ అల్పము. నృత్య నాటికల యందు గద, కత్తి, బాణము, యిత్యాది ఆయుధముల నుపయోగించక వానిని గూడ హస్తముద్రల ద్వార నభినయించుచున్నారు. కాని యక్షగానములంది ఆయుధములు పయుక్తములు. నృత్యనాటకము లయిన యక్షగానము లందు నృత్యనాటికల యందు దరువులు స్థానమధికము. సమానము నృత్యనాటికల యందు యక్షగాన ప్రయోక్తమయిన సుత్రధారునకుండు వేషముండదు. పాత్రలను పలుకరించుటయు కన్పట్టదు. ఈ నృత్యనాటికల యందు స్త్రీ భూమికలను స్త్రీలే నిర్వహించు చుండిరి. యక్షగానము లందు స్త్రీలకు స్థానముండదు. ఈ సంప్రదాయము నృత్యనాటికల యందు సడలినది. శ్రీ చినసత్యంగారు శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు విరచిత మయిన 'క్షీరసాగర మథనము' శ్రీ భుజంగరాయశర్మ కృతమగు 'శ్రీ కృష్ణ పారిజాతము' 'శాకుంతలము' 'ఛండాలిక' 'పద్మావతి' శ్రీనివాసకల్యాణము, కల్యాణరుక్మిణీ, హర విలాసము 'శ్రీ బాలాంత్రపు రజనికాంతరావుగారి 'మేనకా విశ్వామిత్ర' శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కృత 'విప్రనారాయణ' 'శ్రీ.టి. కృష్ణమూర్తిగారు వ్రాసిన 'కుమారసంభవము' ఇత్యాది నృత్యనాటికలను ప్రదర్శించు చుండిరి.

## చలన చిత్రములలో కూచిపూడి నాట్యస్థానము:

కూచిపూడిలోని ప్రముఖ కళావేత్తలయిన 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ వెంపటి పెదసత్యం, ప్రభృతులు శ్రీ వేదాంతం జగన్నాథశర్మ, శ్రీ వెంపటి చినసత్యం మద్రాసులోని చలనచిత్రసీమ కేతెంచిన విషయము పూర్వోక్తము.

చలనచిత్ర నిర్మాతలు ప్రేక్షకలోకమునకు కూచిపూడి కళపై గల నభిరుచిని గ్రహించి చిత్రము లందు కూచిపూడి వ్యస్తనృత్యాంశములకు చిన్న చిన్న యక్షగానములకు తావు నిచ్చుచుండిరి. దశావతార శబ్దము రామాయణ శబ్దము క్షేత్రయ్య పదములు, జయదేవుని అష్టపదులు, జావళీలు, తిల్లానాలు, కౌత్తములు, యక్షగానములు భామాకలాపము, ప్రహ్లాద ఉషాపరిణయము గిరిజాకల్యాణము వగైరా (?) వరూధిని ప్రవరాఖ్యములు చలనచిత్రములందు స్థానమును పొందినవి.

తెలుగు చలనచిత్రము లందు పైన పేర్కొనబడిన కూచిపూడి నాట్యాచార్యులకే నాట్యమును ప్రవేశపెట్టిన ఘనత దక్కినది. నేటికిని తెలుగు చలనచిత్రము లందు నృత్యశాఖకు కూచిపూడి నట్టువోజుల ఆధిపత్యము సాగుచుండుట ముదావహమైన విషయము.

## ఆంధ్రదేశ పట్టణములలో కూచిపూడి నాట్యము:

నేడు కూచిపూడి నాట్యకళకు పీఠము వేయని పట్టణములేదు. కూచిపూడి నాట్యాచార్యులు ఆంధ్రదేశములోని ముఖ్యపట్టణము లన్నిటి యందును కళను ప్రచారము చేయుచుండిరి. అంతేకాక రాష్ట్రేతరము లందును కూచిపూడి ఆర్ట్సు అకాడమీలను స్థాపించి కూచిపూడి నాట్యసరస్వతికి ఖండాంతర ఖ్యాతి నార్జించు చుండిరి. ఆంధ్రదేశము నందలిపట్టణములోలలోని నట్టువోజులు...

నట్టువోజుని పేరు

1. శ్రీ భాగవతుల రామకోటయ్య
2. శ్రీ వేదాంతం జగన్నాథశర్మ
3. శ్రీమతి సుమతీకౌశల్
4. శ్రీ నటరాజ రామకృష్ణ
5. శ్రీ బొక్కా కుమారస్వామి
6. శ్రీ యలేశ్వరపు సూర్యప్రకాశరావు
7. శ్రీ పసుమర్తి రామలింగం
8. శ్రీ జోస్యుల సీతారామశాస్త్రి
9. శ్రీ భాగవతుల యజ్ఞనారాయణశర్మ
10. కుమారి లంకా అన్నపూర్ణాదేవి
11. శ్రీ యలేశ్వరపు నాగేశ్వరశర్మ
12. శ్రీ మహంకాళి సూర్యనారాయణ
13. శ్రీ చింతా సీతారామాంజనేయులు
14. శ్రీ భాగవతుల రామమూర్తి
15. శ్రీ భాగవతుల మోహనరావు
16. శ్రీ ప్రభల మురళీకృష్ణ.
17. శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి
18. శ్రీ చింతా ఆదినారాయణ
19. శ్రీ మహంకాళి శ్రీమన్నారాయణ
20. శ్రీ మహంకాళి సూర్యనారాయణ
21. శ్రీ భాగవతుల వేంకటరామమూర్తి
22. శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ
23. శ్రీ వేదాంతం సీతారామశాస్త్రి
24. శ్రీ కోరాడ నరసింహరావు
25. శ్రీ శ్రీ.సి.ఆర్. ఆచార్య
26. శ్రీ శ్రీ హేమాద్రి చిదంబర దీక్షితులు
27. శ్రీ పసుమర్తి సీతారామయ్య

28. శ్రీ భాగవతుల రామతారకం
29. శ్రీ వేదాంతం మాచేశ్వరరావు
30. శ్రీ చింతా రామమూర్తి
31. శ్రీ వెంపటి కోదండరామయ్య
32. శ్రీ పసుమర్తి కోదండరామయ్య
3ృఫ శ్రీ వెంపటి చినసత్యం
34. శ్రీ వేదాంతం మల్లిఖార్జునశర్మ
35. శ్రీమతి యామినీ కృష్ణమూర్తి
36. శ్రీమతి స్వప్నసుందరి
37. శ్రీమతి ఇంద్రాణి రెహమాన్
38. శ్రీమతి సోనార్ మాన్‌సింగ్
39. రాజారెడ్డి రాధారెడ్డి
40. శ్రీ సంపత్కుమార్

పట్టణం పేరు
హైదారాబాదు, కూచిపూడి నృత్యగురుకులము
,,
హైదరాబాదు, నృత్యశిఖరము
,,
హైదరాబాదు, నృత్యశిఖరము
,,
,,
విజయవాడ
,,
,,
మచిలీపట్టణము
,,
గుడివాడ
,,
,,

అవనిగడ్డ
గుంటూరు
,,
బాపట్ల
సూర్యారావు పేట
రామచంద్రపురము
ఏలూరు
,,
,,
అహమ్మదాబాద్
కొవ్వూరు
విశాఖపట్టణము, శ్రీ వేంకటరామ కూచిపూడి నాట్యకళాశాల
కావలి
నెల్లూరు
నర్సాపురము
వరంగల్లు... శ్రీ వెంపటి వెంకటనారాయణ
కూచిపూడి కాకతీయ నృత్యకళాశాల
ఖమ్మము
మద్రాసు... కూచిపూడి ఆర్ట్సు అకాడమీ
ఢిల్లీ
,,
,,
,,
,,
,,
విజయనగరము

# కూచిపూడి కళాభారతి విదేశయాత్ర:

కూచిపూడి నాట్యకళ అచిరకాలమునందఖండ ఖ్యాతి నార్జించుకొనినది. స్వదేశీయులనేగాక విదేశీయులను ఆకర్షించినది. కూచిపూడి నాట్యమును తొలిసారిగా విదేశీయులకు 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ కోరాడ నరసింహారావుగారు చవిచూపించిరి. శ్రీ నరసింహారావుగారు పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు వాస్తవ్యులు. పట్టభద్రులు. కూచిపూడి 'నాట్యకళానిధి' శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ, శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ గారలు వీరికి గురువులు. శ్రీమతి ఇంద్రాణి రెహమాన్ సహకారసంపత్తితో ప్రదర్శన లందు సహభాగురాలిగా కూచిపూడికి తొలిసారిగ విదేశఖ్యాతి నార్జించిరి. అంతేకాదు. సుమారిరువది సంవత్సరముల క్రింద పారిస్ మహానగరమున జరిగిన అంతర్జాతీయ నాటకసదస్సు నందు కూచిపూడి యక్షగానమున ప్రదర్శనకు ప్రథమ బహుమతి నార్జించిన భరతకళా ప్రపూర్ణులు శ్రీ కోరాడ నరసింహారావుగారు.

నరసింహారావుగారి తరువాత మద్రాసులోని కూచిపూడి ఆర్ట్సు అకాడమీ వ్యవస్థాపకులు, కులపతులు శ్రీ వెంపటి చినసత్యం గారికి 1971 లో యూరప్‌దేశం రంగస్థలమైనది. 1972లో వీరు శ్రీమతి వైజయంతిమాల, హేమమాలినులను నర్తకినులుగ గైకొని మలేషియా యందు కూచిపూడి నాట్యప్రదర్శన లిచ్చిరి. 1973లో ఉత్తరదక్షిణ అమెరికాదేశములు శ్రీ చినసత్యం గారికి నాట్యమండపము లయినవి. 1974లో యునైటెడ్ కింగ్‌డమ్ నలుదెసల యందు శ్రీ చినసత్యంగారు 'శ్రీ కృష్ణ పారిజాత' పరిమళములను వెదజల్లిరి. ఈ 'శ్రీ కృష్ణపారిజాతము' నందు ప్రధాన భూమిక యయిన సత్యభామ పాత్రను కుమారి శోభానాయుడు పోషించి స్తుతి పాత్రురాలయినది. ఇంతేకాక లండన్, కాలిఫోర్నియా,

ఫ్రెంచి, ఫ్రాన్సు, పారిస్, న్యూయార్కు, జర్మనీ, సిలోను, సింగపూర్, దుబాయ్, రష్యా యిత్యాది విదేశములచేత కూచిపూడి నాట్యభారతికి ఉన్నత పీఠములు వేయించి నివాళు లర్పింపజేసిన ఖ్యాతి శ్రీ చినసత్యంగారికి దక్కినది.

శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ గారు తన శిష్యబృందంతో పారిస్ యిత్యాది దేశములందు కూచిపూడి కళానృత్యమును జాటిరి.

శ్రీ పసుమర్తి రామలింగశాస్త్రి అమెరికా, కెనడా, ఫ్రాన్సు, సింగపూర్, సిలోన్ యిత్యాది దేశములలో తన శిష్యబృందంతో కూచిపూడి నాట్యమును ప్రచారమును గావించిరి.

1986లో పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ, శ్రీ వేదాంతం మాణిక్యశర్మ భారతప్రభుత్వ ఆహ్వానముపై ప్యారిస్‌లో యక్షగాన సరస్వతిని ఆవిష్కరించిరి. 1987లో డాక్టర్ శ్రీ వెంపటి చినసత్యంగారు కూచిపూడి ఆర్టు అకాడమీ శిష్యబృందంతో ఫెస్టివల్ ఆఫ్ ఇండియా... రష్యాలో కూచిపూడి నాట్య సరస్వతిని ఆవిష్కరించిరి.

1988లో శ్రీ భాగవతుల వెంకటరామశర్మ అమెరికాలో కూచిపూడి నాట్య సోదాహరణ ప్రసంగములను నొసంగి ప్రశంసింపబడిరి.

కుమారి శోభనాయుడు రష్యా, జపాన్, క్యూబా, దేశములలో ఫెస్టివల్ ఆఫ్ ఇండియా సందర్భంగా కూచిపూడి నాట్యమును ప్రదర్శించి పేరెన్నికగన్నది.

'భరతకళా ప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారి శిష్యురాండ్రు శ్రీమతి యామినీ కృష్ణమూర్తి, శ్రీమతి సుమతికౌశల్, 'ఉత్తమనాట్యాచార్య' శ్రీ పసుమర్తి సీతారామయ్య, శ్రీ వెంపటి చినసత్యంగార్ల శిష్యురాలయిన స్వప్నసుందరి, శ్రీమతి సోనార్ మాన్‌సింగ్, కుమారి రత్నపాప, రాజారెడ్డి రాధారెడ్డి, ప్రభృతులు విదేశములందు కూచిపూడి నాట్యకళ ప్రాచీనతను, ప్రాముఖ్యతను తెలుపుచు ప్రదర్శన లిచ్చి పేరు ప్రతిష్ఠలు సముపార్జించి సముచిత సన్మానములను పొంది స్తుతిపాత్రులయిరి.

## ఖండాంతరమందు కూచిపూడి నాట్యకళాపీఠములు:

కూచిపూడి నాట్యకళ నేడజరామరత్వము నొంది అఖండ ఖ్యాతి నార్జించుచు విరాజిల్లుచున్నది. భారతదేశములోని ఆంధ్ర, మద్రాసు రాష్ట్రములందు పలుచోటులందు కూచిపూడి నాట్యపీఠములు స్థాపింపబడి విరివిగ ప్రచారము సాగుచున్నది. శ్రీ వెంపటి చినసత్యంగారి శిష్యురాలయిన రత్నపాప అమెరికాలోని టెక్సాస్‌లో కూచిపూడి నాట్యకళ పీఠమును స్థాపించి తానే పీఠాధిపతియై శిక్షణ నొసంగుచున్నది. అమెరికా దేశమునందే శ్రీ చినసత్యంగారి శిష్యురాలయిన జయ, రీటాదేవి ప్రభృతి నర్తకీమణులు కూచిపూడి కళాశాలలను స్థాపించి విరివిగ ప్రచారము చేయుచుండిరి.

లండన్ పౌరుడు శ్రీ కామదేవ్ మద్రాసులోని శ్రీ వెంపటి చినసత్యంగారి కూచిపూడి ఆర్టు అకాడమీ యందు సంవత్సరముల తరబడి కష్టించి కూచిపూడి నాట్యము నార్జించి జర్మని తదితరదేశములందు ప్రదర్శనము లిచ్చి లండన్ నందు కూచిపూడి నర్తనశాలను స్థాపించి తానే ప్రధానాచార్యులయి శిష్యులకు శిక్షణ నొసంగుచుండిరి.

లోలా, సావిత్రినాయర్, ఇత్యాదులు ఫ్రాన్సుదేశము నందు తాము శ్రీ చినసత్యంగారి యొద్ద అధ్యయనము చేసిన నాట్య సంప్రదాయం సరణులను, నాట్యశాలలను యేర్పరుచుకొని అధ్యాపనము చేయుచుండిరి.

సిలోన్‌నందు 'కూచిపూడి ఆర్టు అకాడమీ' నామముతో రంగమణి వివేకానంద్. ఆనందవల్లి కూచిపూడి కళాక్షేత్రమునకు వారసులను తయారు చేయుచుండిరి.

సింగపూరు నందు రాణీసునంద నొక నాట్యశాలను నిర్మించి యచట కూచిపూడి కళను శిక్షణ నొసంగుచుండెను.

ఈ విధముగా శ్రీ వెంపటి చినసత్యంగారి ఆచార్యత్వము క్రింద సుశిక్షితులయిన నర్తకులు విదేశములందు కూచిపూడి కళామతల్లికి

పీఠము వేసి ప్రచారము చేయుచు నీరాజనము అర్పించుచుండిరి. ముఖ్యముగ కూచిపూడి నాట్యమునకు విదేశఖ్యాతి నధికముగ నార్జించుచుండిన నాట్యాచార్యులు శ్రీ వెంపటి చినసత్యంగారు వీరి సేవ స్తుతిపాత్ర మయినది.

## సంప్రదాయ సరణులలోని సడలింపులు:

పూర్వకాలము నందు వలె కూచిపూడి భాగవతులు నేడు స్వయంపాకములకు స్వస్తిచెప్పిరి. నాటి వీరి సామాగ్రి సరంజామాలు గణేయం పెట్టె యందు భద్రపరచుకొనిరి. నేడు గణేయంపెట్టెకు బదులు ట్రంకుపెట్టెలు, సూటుకేసులు దర్శన మిచ్చుచున్నవి. నాడు కూచిపూడి భాగవతులు పునుగు, జీలుగ, బాడిద, వేణువు యిత్యాదులతో తయారుచేసికొనిన చెక్క సామాగ్రి ఆభరణములు కనుమరగగుచున్నది. వీటి స్థానమున రోల్డు గోల్డు రాళ్ళ ఆభరణము అలంకరించపబడుచున్నవి. గద కత్తి బాణము యిత్యాద్యాయుధములును స్టీలుతో తయారుచేయబడినవి వాడబడుచున్నవి. నాడు తిత్తి మృదంగము వీరి హంగులు. నాటి తిత్తిస్థానమును నేడు హార్మోనియం ఆక్రమించినది. ఉపరి వయొలిన్, వీణ, తంబుర, ఘటము, క్లారినేట్, వేణువు ఇత్యాదుల నుపకరించుచున్నారు. నేడు నేపథ్యములు రంగస్థలమునకు స్థిరపరచబడియుండును. నాడు నేపథ్యములు యిరువురు చెలులుపట్ట పాత్ర ప్రవేశించుచుండెడిది. నిష్క్రమించునపుడట్లే చెలుల తెరమరుగై నిష్క్రమించెడిది. నేడు తెరవేయుట, తీయుట. ముఖాలంకరణ రంగుల విషయమున నేడు క్రీములు వచ్చినవి. నాడు సఫేదు, ఎరుపు, నలుపు, హరితము, ఇత్యాది రంగులను కొబ్బరినూనెతో కలిపి ముఖాలంకరణ జేసికొనెడివారు. నాడు రుక్మాంగద వేషధారి, నృసింహపాత్రధారి, ఇత్యాదులు ప్రదర్శనము రోజున నుపవశించి ప్రదర్శనానంతరము ఆహారము తీసికొనెడివారు. నేడుపవాసములు ఉల్లంఘనము జరుగుచున్నది.

నాడు ఆముదపు దీపములు, కిరోసిన్ దీపములు, పెట్రోమాక్స్

లైట్లు, నేడు విద్యుత్ దీపములతో కూచిపూడి కళాకారులు ధగద్ధగాయమానముగా మెరియుచున్నారు. పురోభివృద్ధికి ఆటంకముగాని సంప్రదాయముల అనుసరణ అంత్యంత అవసరము. పురోభివృద్ధికి ఆటంకములైన సంప్రదాయములను తక్షణము వదలుట శ్రేయోదాయకం. ఈ విషయమున డాక్టర్ శ్రీ వెంపటి చినసత్యంగారి సంప్రదాయానుసరణ అంత్యంత శ్లాఘనీయం.

## పునరుద్ధరణావశ్యక విషయములు:

కూచిపూడి వారు ప్రదర్శించు వ్యస్తనృత్యాంశములకుగాని, యక్షగానములకుగాని సూత్రధారుడు జీవగఱ్ఱ. ఈనాడు కూచిపూడిలో సూత్రధారునిలోటు పాత్రధారులలోటు అధికముగ గానవచ్చు చున్నది. కూచిపూడిలోని యువకళాకారులందు కృషిలోపించినది. సంగీత సాహిత్య పరిజ్ఞానము సన్నగిల్లుచున్నది. ఇందువలన వాచికాభినయపటుత్వమునకు ఘాత కలుగుచున్నది. చతుర్విధాభినయము లయిన అంగిక వాచిక ఆహార్య సాత్వికాభినయములను సమపాళ్ళలో మేళవించి సమగ్రతను సముపార్జించుకొనిన కూచిపూడివారిలో నేడీ వాచికాభినయపు లోటు కన్పట్టుట విచార్యము. కొన్ని సంప్రదాయములలో సడలింపులు సంభవించినయి. కాలముననుసరించి కొన్ని చేర్పులు మార్పులు వచ్చినవి. పూర్వము నాలుగువీధులు కలియుచోట ఆముదము దీపములందు, కాగడాలపై గుగ్గిలముచల్లి ఆ కాంతులలో పాత్రప్రవేశమయ్యేడిది. సూత్రధారులు పాత్రధారులు తమ యావచ్ఛక్తిని వినియోగించి హెచ్చుశ్రుతి యందు సామాజికులందరికి వినబడునటుల గానము చేసేడివారు. నేడు విద్యుచ్ఛక్తి, చక్కని నాట్యమంటపములు, దూరశ్రవణ యంత్రములు వచ్చినవి. ఇందుచే నటుల సామర్థ్యము ప్రతిభ మరింత కన్పట్టు నవకాశము కలదు. పెరిగిన సాంకేతికపు విలువలను సద్వినియోగపరచుకొని కళాకారులు తమ ప్రతిభను పెంపొందించుకొని ప్రదర్శించవలయును. కూచిపూడి

యందు భాగవత మేళములవలెనే పగటి వేషమేళము లుండెడివనుట పూర్వోక్తము. నేడు విజ్ఞాన వినోదప్రదము లయిన పగటివేషములు పగటి కలలగు ప్రమాద మేర్పడుచున్నది, కారణము వీనికి తగినంత పోషణ లేకపోవుటయేగాక విద్యాధికులు సయితము వీనిని చిన్నచూపు చూచుచుండిరి. ఇది దురదృష్టకరమైన విషయము. వీటి పునరుద్ధరణమునకు కొంతమంది కళాకారులు కంకణం కట్టుకొనవలయును. కూచిపూడి కళాక్షేత్రమున పగటివేషముల శిక్షణశాఖ నొకదాని నేర్పరచి అందు యువ కళాకారుల బహురూపకకళను బోధించవలయును.

క్రమశిక్షణతో పరిపక్వత నొందిన నట్టువోజులచే యక్షగానములను, నృత్యాంశములను, శాస్త్రసమన్వయ దృక్పథముతో శిక్షణ నొసంగవలయును. దీనిచే విద్యార్థులు శాస్త్రమర్యాదను సంప్రదాయసరణులదు సమన్వయపరచుకొనగల శక్తి సంపన్ను లగుదురు.

పూర్వకాలమునాటి పునుగు, జీలుగ, వేణువులతో తయారుచేయబడిన ఆభరణములు అరుదగుచున్నవి. కాలము ననుసరించి ఆభరణములలో మార్పు వచ్చినను సంప్రదాయమును చెదరనీయక భద్రపరుపవలసిన ఆవశ్యకత ఎంతేనికలదు. ఆహార్యకారులచే కూచిపూడివారు తమ సంప్రదాయములు ననుసరించి ఆభరణములను తయారుచేయించి నొక ప్రదర్శనశాల యందు నిక్షిప్త మొనర్చిన తరువాతి తరము వారికి చెక్కసామగ్రి గురించిన విషయము తెలిసికొనుట కవకాశ ముండును.

ఇక మంత్రశాస్త్ర మడుగంటుచున్నది. నాటి క్షుద్రప్రయోక్తలు నేడు కన్పట్టకపోవచ్చును. ఏది ఏమైన మంత్రము తంత్రము తెలిసికొనియుండుట మంచిదిగదా! కనుక మంత్రశాస్త్రమును కూడా పునరుద్ధరించిన బాగుండును.

కూచిపూడి యను కుగ్రామ మందావిర్భవించిన నాట్యకళ నేడు పట్టణములలో పీఠము వేసినది. చలనచిత్రములలో రేడియో టి.వి.లందు స్థానము సంపాదించినది. అంతటితో తృప్తినొందక దేశపు ఎల్లలను దాటినది. అదిచాలక విదేశము లందడుగిడినది. విస్తృత ప్రచారమును పొందుచున్నది. ఖండాంతరవాసులచే కూచిపూడి కళా భారతి నీరాజనముల నొందుచున్నది. ఇది ముదావహమైన విషయము. అంతేకాదు. జాతికి గర్వకారణమైన విషయము. ఈ ఉన్నతస్థితి నుండి దిగజారక పైన తెల్పిన సముద్ధరణావశ్యక విషయములను పునరుద్ధరించిన కూచిపూడి నాట్యకళ అజరామరత్వము నొందుట తథ్యము.

# కూచిపూడి నాట్యం డా. శ్రీ వెంపటి చినసత్యం

శ్రీ వెంపటి చినసత్యంగారు 1929 అక్టోబరు 25వ తారీఖున వరలక్ష్మమ్మ, చలమయ్య అను దంపతుల పుణ్యముల పంటగ కూచిపూడి మాగాణముపై ప్రభవించిరి. వంశానుసరణముగ వచ్చు కూచిపూడి నృత్యరీతులను శ్రీ తాడేపల్లి పేరయ్యశాస్త్రిగారి కడ, తదనంతరము 'నాట్యకళానిధులు' శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారి యొద్ద అభినయవిద్యను నభ్యసించిరి. శ్రీ పసుమర్తి కొండలరాయుడుగారి దగ్గర యక్షగాన సరస్వతి నారాధించిరి. వీరి కింతవరకు నేర్చుకొనిన విద్య తృప్తినొసంగ లేదు. 1947 లో వీరికి సోదర వర్గమునకు చెందిన శ్రీ వెంపటి పెదసత్యంగారిని శుశ్రూషించిరి. 1950 లో శ్రీ సత్యంగారు మెట్రిక్యులేషన్ పరీక్ష యందుత్తీర్ణులయిరి.

కాని శ్రీ చినసత్యంగారు నిరంతరం తీవ్రమయిన ఆలోచనా నిమగ్నులయి కన్పట్టెడివారు. కూచిపూడి నాట్యవ్యవస్థ అస్తవ్యస్తమై అవ్యవస్థతో కూడి కాలదోషమునకు గురి యయినదని దానిని సంస్కరించి తమదిగా నొక ప్రత్యేక నాట్యశైలిని నేర్పరచి దానికి తగినంత ప్రచారము చేయవలయునని అందులకొక కళాశాలను స్థాపించి దానికి ఆశ్రమ వాతావరణము నేర్పరచి నిరంతరము చరణకింకిణుల సవ్వడితో నాట్యాధిదేవుడగు నటరాజు నర్తింపచవలెనని కలలు గనిరి. వీరి కలలు కార్యరూపమగు సమయమాసన్నమయినది. 1963 లో కళలకు కాణాచియగు మద్రాసు మహానగరమున 'కూచిపూడి ఆర్ట్సు అకడామీ'ని స్థాపించిరి. ఈ సంస్థను ఉత్తమ ఆశయములతో ఉన్నత ఆదర్శములతో నిర్వహించు చుండిరి.

సుమారొక దశాబ్దమునుండి కూచిపూడి నాట్య కళాకారులు శాస్త్ర విషయమును గురించి ఆలోచించక యధోచితముగ కాలము గడుపుచుండిరి. ఇది శ్రీ సత్యంగారికి దుర్భరవేదనము కలుగచేసినది. కూచిపూడి నాట్యమునకు లక్షణ గ్రంథములయిన భరముని ప్రోక్త



నృత్య నాటిక ప్రపంచ పరమేష్ఠి
డా॥ శ్రీ వెంపటి చిన్నసత్యం

నాట్యశాస్త్రమును, నందికేశ్వరుని అభినయ దర్పణమును అవగత మొనర్చుకొనిరి. అతఃపూర్వమే తాము నేర్చుకొనిన లక్ష్యములను శాస్త్రసమన్వయ మొనర్చుట యందు దృష్టిని సారించిరి. కూచిపూడి వారు వ్యస్థముగ ప్రదర్శించు శబ్దములు, జతిస్వరములు, పదములు, అష్టపదులు, జావళీలు, తరంగములు, తిల్లానాలు, యిత్యాదులన్నింటిని తమకు గల శాస్త్రపరిజ్ఞానముతో లక్ష్యములను లక్షణ సమన్వయము చేసిరి. నాట్యమునకు లయజీవము. ఇక సత్యంగారు లయవిన్యాసముపై కేంద్రీకరించిరి. 'మృదంగ తత్త్వము'ను మథించి నవనీతము నందుకొనిరి. ఆశుకవిత్వధోరణి యందు అనంతగతుల లయవిన్యాసము లనంతకాలము స్వోపజ్ఞతతో ప్రస్తరించుశక్తి సామర్థ్యములను సముపార్జించిరి. 'లయబ్రహ్మ' లయిరి.

ఇంతటితో నాట్యము సమగ్రము కాదని గ్రహించి శ్రీ సత్యంగారు నాట్యమున శిల్ప మనర్ఘమని భావించిరి. వీరు నాట్యమునందే భంగిమ యయినను అదియొక శిల్పమువలె నుండవలెనని, అప్పుడే అది కళ యనిపించుకొనునని తలంచిరి. అంతేకాక అది అష్టోత్తరశతమయిన నేదియో నొక కరణమై యుండినగాని శాస్త్రము కాదను విషయమును దృక్పథమునం దిడుకొని శాస్త్రీయ పద్ధతిలో తాము భావించిన విధముగ విద్యార్థినీ విద్యార్థులను రూపొందించుచుండిరి. ఇదే శాస్త్రీయదృక్పథముతో నృత్య నాటికలను చేపట్టిరి.

1961 లో కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర నిర్మాణ నిమిత్తము ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు కూచిపూడి కులపతులచే క్షీరసాగరము మథింపజేసిరి. ఈ క్షీరసాగర మథనమునకు రూపురేఖలు తీర్చిదిద్ది ఆంధ్రావళికి అమృతము నందించినది శ్రీ సత్యంగారె. ఇది వీరి ప్రథమ నృత్యనాటిక. తరువాత శ్రీ కృష్ణపారిజాతమును, విప్రనారాయణను, మేనకావిశ్వామిత్ర, ఛండాలిక, శ్రీనివాస కల్యాణము,కల్యాణ రుక్మిణి, హర విలాసం నృత్య నాటికలను సద్యోహృద్యముగ చేసి సహృదయ నైవేద్య మొనర్చుచున్నారు.

శ్రీ చిన సత్యంగారు కూచిపూడి నుండి మోహన్, శ్రీ రామచంద్రివరప్రసాది, యిత్యాది విద్యార్థులను తమతో తీసుకొని వెళ్ళి నాట్యవిద్య నేర్పుచుండిరి. కేవలము విద్యాదానమే కాక నిరతాన్నదాతలై యన్వర్థకులపతులయిరి. వీరి యశశ్చంద్రికలు భారతావనిదాటి ఖండాంతరమున అఖండముగ భాసించు చున్నవి. వీరి కూచిపూడి ఆర్ట్సు అకాడమీ బయలువెడలిన శిష్యకోటిలో గణింపదగిన హేమాహేమీలు రత్నపాప, యామినీ కృష్ణమూర్తి, శోభానాయుడు, మంజుభార్గవి, అనుపమ, బాల, హేమమాలిని, వైజయంతిమాల, యిత్యాదులు. విదేశములనుండి వచ్చి కూచిపూడి నాట్యమును శ్రీ సత్యంగారి యొద్ద నేర్చిన ప్రముఖులలో కామదేవ్ లండన్, తదితరులు గణనీయులు విదేశీ శిష్యులు విదేశములలో కూచిపూడి నాట్యమును ప్రచారము చేయుచుండిరి.

ఈ విధముగా కూచిపూడి నాట్యభారతికి అనుంగు బిడ్డడై ఖండాంతర ఖ్యాతినార్జించుచు తమ బ్రతుకును కళామతల్లికి నైవేద్యము గావించుచున్న శ్రీ వెంపటి చినసత్యం గారు ఆదర్శజీవి. శ్రీ సత్యంగారు 1978 లో తిరుమల తిరుపతి ఆస్థాన నాట్యాచార్యులుగ నియమింపబడి శ్రీనివాసుని కటాక్షమునకు పాత్రులయిరి.

శ్రీ చిన సత్యంగారు అమెరికా, రష్యా, ప్యారిస్, దుబాయ్ యిత్యాది పాశ్చాత్య దేశాలలో కూచిపూడి నాట్యకళా భారతిని ఆవిష్కరించి కూచిపూడికి ఎనలేని ఖండాంతర ఖ్యాతి నార్జించుచున్నారు. శ్రీ చిన సత్యంగారిని ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 1980 లో కళా ప్రపూర్ణ డాక్టరేట్ బిరుదుతో సన్మానించారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం శ్రీ చిన సత్యంగారిని గౌరవ డి.లిట్‌తో సంభావించింది. కూచిపూడి నాట్యాచార్యులలో ఇంతవరకు ఎవ్వరికిని యిట్టి గౌరవ ప్రతిపత్తి లభించలేదు. ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ శ్రీ చిన సత్యంగారిని "భరత కళా ప్రపూర్ణ" బిరుదాంకితులని చేసినది. భారత ప్రభుత్వం రష్యాలో నిర్వహించుచున్న ఫెస్టివల్ ఆఫ్ ఇండియాలో కూచిపూడి నాట్యకళా భారతిని ఆవిష్కరించవలసినదిగా డాక్టర్ చిన సత్యంగారిని కోరగా శ్రీ చిన

సత్యంగారు కూచిపూడి కళా రీతులను ప్రదర్శించి భారతదేశమునకు కూచిపూడి నాట్యమునకు అఖండ కీర్తి ప్రతిష్టలను సముపార్జించిరి. ఈ సంవత్సరము శ్రీ చిన సత్యంగారు స్థాపించిన కూచిపూడి ఆర్టు అకాడమీ రెండున్నర దశాబ్దములు పూర్తి చేసికొనినది. ఈ సందర్భంగా కూచిపూడి ఆర్టు అకాడమీ రజతోత్సవ వేడుకలు జరుపుకొన బోవుచున్నది. శ్రీ చిన సత్యంగారు కూచిపూడి ఆర్టు అకాడమీ వ్యవస్థాపక ప్రాచార్యులై, నిర్దేశకులై, కులపతులై కూచిపూడి నాట్యకళకు చేయు సేవలు అద్వితీయములు.

## పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ:

'భరతకళ ప్రపూర్ణ శ్రీ వేదాంతం రాఘవయ్యగారి తరువాత కూచిపూడిలో సమర్థులయిన స్త్రీ పాత్రధారులు రంగస్థల మందడుగిడుటకు సుమారొక దశాబ్దము పట్టినది. ఈ కాలము కూచిపూడి చరిత్ర యందు చీకటియుగము వంటిది. శ్రీ రాఘవయ్యగారు శ్రీ చింతా వేంకటరామయ్యగారి శిష్యుడు.

శ్రీ వేంకటరామయ్యగారి తృతీయపుత్రులు 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారు. వీరు తండ్రి స్థానమునకు వచ్చి తగిన శిష్యునకై అన్వేషణారంభించిరి. ఇట్టి సమయమున వీరికి సర్వాంగసుందరము, సౌష్టవము కల ఒక చక్కని చిక్కని నూతన యౌవన వయస్కుడైన విద్యార్థి లభించెను. ఆ విద్యార్థి ఎవరో కాదు. సుమారు ఇరువది సంవత్సరముల నుండి నేటివరకు స్త్రీ పురుషులను సందేహాస్పదులను కావించుచు సమ్మోహితులను చేయుచున్న 'పద్మ శ్రీ' వేదాంతం సత్యనారాయణశర్మగారే.

శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారు 1935 వ సంవత్సరము సెప్టెంబరు తొమ్మిదవ తారీఖున కూచిపూడి కళాక్షేత్రమున ప్రముఖ కళావేత్తయయిన వెంకటరత్నం' సుబ్బమ్మ అను జంట పంటలో తృతీయులుగ నుదయించిరి. కుల విద్యయయిన కూచిపూడి నృత్యమును బాల్యమున తమ జ్యేష్ఠసోదరులయిన శ్రీ ప్రహ్లాదశర్మగారి వద్ద అభ్యసించిరి. సంగీతము శ్రీ యలేశ్వరపు సీతారామాంజనేయులుగారి యొద్ద నేర్చిరి.

శ్రీ చింతా కృష్ణమూర్తిగారి గురుత్వము క్రింద శ్రీ శర్మగారు ఉష, భామ, మోహిని, గొల్లభామ, యిత్యాది యక్షగాన నాయిక పాత్రలను అభినయపూర్వకంగా నేర్చిరి.



కూచిపూడి నాట్య రూపానురూపం
పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ

శ్రీ కృష్ణమూర్తిగారు గురువుగా శర్మగారి పయినున్న 'మాయ' పొరను తొలగించిరి. తరువాత శ్రీ శర్మగారు సూక్ష్మగ్రాహులగుటచే క్లిష్ట విషయమును సయితము అనతికాలమున అవగాహనచేసికొనగల మేధాసంపన్నులు. గురువుకు తగిన శిష్యుడు లభించుట ఇరువురి పూర్వజన్మ సుకృతముగదా! శ్రీ కృష్ణమూర్తిగారి కళకు శ్రీ శర్మగారు సాధన యయిరి. వీరిరువురికి శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి సారథ్యముతో కూచిపూడి కళాక్షేత్రమున కాక నూతన చైతన్యము చేకూరినది. అంతేకాదు. వీరి కలయికయే కూచిపూడిలోని నేటి శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రము.

కూచిపూడి నృత్యమును శాస్త్రీయము కాదనిన నరకాసురులపై సత్యభామయయి శ్రీ శర్మగారు గురువుగారు శ్రీ చింతా కృష్ణమూర్తిగారి సారథ్యమున సవాలు చేసిరి. శ్రీ శర్మగారు. ఆనాటి కూచిపూడి నాట్యసదస్సున శ్రీ శర్మగారి నటనావైదుష్యమునకు సమ్మోహితులు కాని సామాజికుడు లేడు. ఆనాటితో కూచిపూడి నాట్యముపయి చెలరేగిన గాలి దుమారము రూపుమాసినది.

శ్రీ శర్మగారిచే కృష్ణమూర్తిగారు తొలిసారిగ కూచిపూడి సమీపములోని పెదముక్తేవి గ్రామమున 'ఉష' పాత్రను పోషింపజేసిరి. ముగ్ధవయసుకు తగిన హావ భావ విలాస చేష్టతో శ్రీ శర్మగారు ఆనాడే ఉజ్జ్వల భవిష్యత్తుగల నటులుగ గుర్తింపబడి సన్మానమును పొందిరి. ఆనాడు వీరిని 'విశ్వకవి' రవీంద్రనాథఠాగూరు ప్రియశిష్యులయిన శ్రీ నర్రా వెంకటరత్నంగారు సత్కరించిరి. చింతా వారి మేళమయిన శ్రీ వెంకటరామ నాట్యమండలిలో సహభాగత్వము నొందిరి. శ్రీ శర్మగారికి 'ఉష' పాత్ర యక్షగాన నటనాజీవితమున ఉషోదయము. శ్రీ శర్మగారికి 'ఉష' అన్న ఎక్కువ మక్కువ.

శ్రీ శర్మగారు 'ఉష' భూమికను ధరించి అనిరుద్ధుని నిదురనుండి జాగృదావస్థకు తెచ్చు సందర్భమున జయదేవుని 'ప్రియే చారుశీలే' అను అష్టపదిని అభినయించ పురుషులు సయితము బాహ్యస్మృతిని వీడి ఒకసారి స్పృశించిన తరింతుము గదా యని ముద్దిడిన జన్మచరితార్థమగును గదా అని అనుకొందురు.

# లలిత కళలు... పోషణా వశ్యకత

"ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పర పీడన పరాయణత్వం"... శ్రీ శ్రీ...

అనినట్లుగా భారతదేశ చరిత్ర పుటల్లోను పరపీడనం స్థానం చేసికొంది. ఏ దేశ చరిత్రగాని, ఏ రాజు చరిత్రగాని సువర్ణాక్షరాలతో లిఖింపబడాలంటే నాటి సంస్కృతీ వైభవానికి ప్రతీకలైన, ప్రతిబింబాలైన, లలితకళలైన, కవిత్వం, శిల్ప, చిత్రలేఖనం, సంగీతం, నాట్యం సమున్నతంగా పోషింపబడాలి.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి నాలుగు దశాబ్దాలైతేగాని మన సంస్కృతికి పట్టుకొమ్మలయిన లలిత కళల పునరుద్ధరణకు అవకాశం రాలేదు. ఇప్పుడిప్పుడే ప్రభుత్వం లలితకళ ప్రాశస్త్యాన్ని గుర్తించి ప్రోత్సహించుట ముదావహం. దానికి కారణం లేక పోలేదు. భారతదేశం ఆధ్యాత్మిక, సాంస్కృతిక సత్సంప్రదాయ రంగములందు వినా, విద్యా, వైజ్ఞానిక, అణుశక్తి యిత్యాద్యనేక రంగాలలో ప్రపంచంలో ఎన్నో దేశాలకన్న ప్రగతి పథంలో వెనుకబడివుంది. మన దేశం వెనుక బడుటకు కారణం మన దేశంలో విద్యావంతులు, మేధావులు, విజ్ఞాన శాస్త్రవేత్తలు లేకకాదు. మన సంఘు, మన ప్రభుత్వాలలో వారికి గుర్తింపు, సమాదరణ, సముచితమైన స్థానంలేక పోవుటచే మనం వారి సేవలను, వారి కృషి ఫలితాలను పొందలేక పోతున్నాం. వారు నిరాశా నిస్పృహలకులోనై వారికి అన్ని విధాల అనుకూల వాతావరణంగల విదేశాలకు వలసపోవుట చరిత్రలో చెరగని సత్యంగ కన్పిస్తోంది. మన దేశీయుల వైజ్ఞానిక, మేధాసంపత్తి, సహకారాలతో విదేశాలతో తయారైన అనేకములు మనం మన దేశానికి అధిక ఖర్చులతో దిగుబడి చేసికొనుటకూడా చరిత్ర చెప్పే సత్యమే. విదేశీయులలో ఆత్మ విశ్వాసం అధికం తొలుత వారిని వారు గౌరవించుకుని, వారి వారిని

వారాదరించుకొని, వారి వారికి వారు సముచితమైన స్థానమిచ్చుకొని వారి సంస్కృతిని వారు తెలిసికొని ఇంటగెలిచి తరువాత పరకీయముల గురించి ఆలోచిస్తారు. అంతేకాదు మంచిని గుర్తించుటలో కూడా వారిదే పైచేయి. ఇక మనలో ఆత్మవిశ్వాసం సన్నగిల్లింది. పొరిగింటి పుల్లకూర రుచిమరిగి పాశ్చాత్యనాగరికతా ప్రవాహంలో కొట్టుకొని పోతూన్నామని తెలిసి, కొట్టుకొని పోతూకూడా, పరకీయానికై అర్రులు చాస్తున్నాం. మనకు, మన సంస్కృతి సంప్రదాయాల గురించి సరియైన సదవగాహన లేదు. దాని ఔన్నత్యం అంతకన్న తెలియదు. విదేశాలలో భారతీయులు భారత భాగవత రామాయణాది యితిహాసాలలో ప్రశ్నిస్తే తెలియక తెల్లమొహాలు వేస్తున్నారు. ఇదీ చరిత్రలో స్థానం సంపాదిస్తోంది. విదేశీయులు మన వారిని మన సంస్కృతిని చాల గొప్పవని దానిని గౌరవించి సముచిత స్థానమిచ్చి, సమాదరించి, ప్రోత్సహించి ప్రచారం చేస్తున్న తరువాత మనం ప్రభుత్వాలు నిద్రావస్థనుండి జాగృదావస్థకు వచ్చి నిజంగా మన సంస్కృతి ఇంత గొప్పదా? మనలో ఇంత మేధావులున్నారా? మన కళలు ఇంత ఔన్నత్యాన్ని కల్గినవా? అని వానిని గూర్చి తెలిసికొనుటకు, పోషించుటకు, గౌరవించుటకు యిప్పుడిప్పుడే

ప్రణాళికలేర్పరుస్తున్నాం. ఈ ప్రణాళికలు కార్యరూపం దాల్చి ఫలవంత మగుసరికి, మన మేధావులు, విజ్ఞానశాస్త్రవేత్తలు, విదేశాలకు వలసపోయినట్లే మన వేద పండితులు. సంస్కృత విద్వాంసులు, కవులు, గాయకులు, శిల్పులు, చిత్రలేఖకులు నాట్యాచార్యులు విదేశాలకు చాల భాగం వలసపోతారు. కారణం నేడు భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు, భారతీయ లలితకళలకు, ఆకర్షింపబడని విదేశం లేదు. అందువలననే మన సంస్కృతికి దర్పణాలైన లలిత కళలకు విదేశీయులు పెద్ద పెద్ద పీటలువేసి పోషించి ప్రచారం చేస్తున్నారు. అభ్యసిస్తున్నారు. మన వేదాల నుండి ఆధునిక కవుల గ్రంథాల వరకు విదేశాలుపోతున్నాయి. మన సంగీతం పరదేశాలలో పాతుకు పోబోతుంది. మన శిల్పాలు విదేశాలలో విరివిగ

ప్రతిష్ఠింపబడుచు, స్వదేశంలో తస్కరింపబడుచు వాటి విలువలను పెంచుకొంటున్నాయి, మన చిత్ర లేఖనాలు చిత్రవిచిత్రంగా విదేశాల విపణులకు విస్తృతంగా పయనిస్తున్నాయి. మన కూచిపూడి నాట్య ఆకాడమీలు విదేశాలలో స్థాపింపబడి పలు రంగ స్థలాలలో ప్రదర్శనలిస్తున్నాయి. ఇట్టి తరుణంలో మన ప్రజలు మన ప్రభుత్వం మనది అనుకునే సంస్కృతిని కాపాడుకోవలసిన బాధ్యత ఎంతైనా ఉంది. ఇది కేవలం ప్రభుత్వంగాని, కేవలం ప్రజలుగాని చేసే పనికాదు. మన సంస్కృతి ఉభయ తారకం. ఉభయ సంబంధీయం కనుక ఉభయులు తమ విధిగ భావించి బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి.

"దీపం ఉండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి"

"చేతులు కాలకముందే ఆకులు పట్టుకోవాలి"... అనిగదా అనుకుంటాం.

అందరు వెళ్ళిపోయిన తరువాత వెనుకకు పిలిపించుకొనుట ఎంత కష్టమో మనకు తెలుసు. ఉదాహరణకు: మన తెలుగు చలనచిత్ర పరిశ్రమను మద్రాసునుంచి తరలించాలని చేసే ప్రయత్నం. స్వదేశంలోనే ఇలా ఉంటే ఇంత కష్టమౌతుంటే, విదేశాలనుండి అంటే ఇంకెంత శ్రమతో కూడిందో ఊహించగలం.

కావున మన సంస్కృతిని మనం కాపాడుకోవాలంటే మన కవులకు, మనగాయకులకు, మన శిల్పులకు, మన చిత్రకారులకు మన నాట్యాచార్యులకు మన సంఘంలో మన ప్రభుత్వంలో సమున్నత స్థానమిచ్చి సమాదరించి పోషించాలి. లేనిచో మా తాతలు నేతులు త్రాగారు మా మూతులు వాసన చూడం డనినట్లే ఒకప్పుడు మా సంస్కృతి చాల గొప్పగా ఉండేదని చరిత్ర చెప్పుకోవాల్సి వస్తుంది.....

మన సంస్కృతిని మనం కాపాడుకోవాలంటే ఒక సాంస్కృతిక విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలి. లేదా నేడు ప్రభుత్వమారంభించిన తెలుగు

విజ్ఞానపీఠంలో నిష్ణాతులయిన కవులను, గాయకులను, శిల్పులను, చిత్రకారులను, నాట్యాచార్యులను ఆచార్యులుగా నియమించి అధ్యయన అధ్యాపనాలు పరిశోధనలు జరిపించవలసిన ఆవశ్యకత ఎంతైనా కలదు. విదేశాలకు వలసబోవు మేధావులను కళా కారులకు తగిన వనరులనిచ్చి వారి కృషి ఫలితాలను మనమే పొందుటకు ప్రస్తుతం ప్రభుత్వం ఎక్కువ బాధ్యత వహించాల్సి ఉంటుంది.

# వ్యాసకర్త



వ్యాసకర్త : డా. చింతా రామనాథం, ఎం.ఏ.పి.హెచ్.డి.
డిప్లమో కూచిపూడి నాట్యం.

మాతాపితరులు : శ్రీమతి చింతా సీతారావమ్మ
"భరతకళా ప్రపూర్ణ"
శ్రీ చింతా కృష్ణమూర్తి.

జననం : 1948.

జన్మస్థలం : కూచిపూడి మొవ్వమండలం, కృష్ణాజిల్లా, ఆం.ప్ర.)

రచనలు : కూచిపూడి నాట్యకళ.
కూచిపూడి నృత్యం-మూర్తిత్రయం.
కావ్య సౌరభాలు - భామాకలాపం.
కూచిపూడి నాట్య-భారతి.
కూచిపూడి నాట్యాచార్యుల చరిత్ర
పుటలు.